ఓమ్

శ్రీమేధాదక్షిణామూర్తిసదాశివ

గురుపరబ్రహ్మణేనమః

శ్రీపార్వతీపతయేనమః

# పీఠిక.

మహాజనులారా!

వేదాంగమగు నీజ్యోతిశ్శాస్త్రము మనదేశమునం దతి చిరకాలమునుండియు నసాధారణ గౌరవభాజనమై పరాపరస్వ పరజాతిమతాది భేదభావంబుల కెడమీయక సర్వజనసేవ్యమై యెల్లఱం దనయాజ్ఞం, దలదాల్ప శాసనబద్ధ పరిపాలనంబుగా వించుచు సుమనోరథాధిగామియై ప్రత్యంతదేశముల నాక్ర మించి యతిలోక మహత్వంబును సర్వాతిశాయి ప్రాభవము గాంచి వెలుగొందిచుండియు నిప్పుడు కాలవశంబున దుస్సహత మఃప్రచురదోషాభిభూతమై తొంటియుత్సాహంబుడిగి నిదుర గ్రమ్మి విశ్రాంతినొందియుండుట మీరెల్లరుం నెఱుంగుదురు. ఎడనెడం బలవరించు గలవరింతలు గూడ సత్యంబున కనతి దూరంబులగుటంజూడ బ్రబోధసమయంబున దత్ప్రతిభావిశేషంబె ట్లుండునదియు యూహింపవచ్చును. ఇప్పుడుమన దేశంబున జ్ఞాన

సూర్యోదయం బాసన్నంబగుటచే నెల్లరుం మేల్కొనుచుండిరిగదా; మనము తక్కిన శాస్త్రంబులనెల్ల మేల్కొలుప యత్నించుచు నీశాస్త్రంబు నేలజోకొట్టవలయు; మనము మేల్కొలుపకున్నను నీశాస్త్రంబు నిదురించునదిగాదు. ప్రభోధసమయంబున నదియే మేల్కొనును. మరియు నీశాస్త్రప్రబోధార్థమై యమరికా జర్మనీ ప్రముఖ ఖండాంతరవాసు లచ్చటనుండిచేయు కోలాహల మంగళధ్వనులు భూనభోంతరమునిండ దిక్కులుపిక్కటిల్లుచున్నవి. ఆసన్నులమగు మనమంతయాడంబరము జేయనవసరములేదు.

యథాశక్తి మన విధికృత్యములను మనము నిర్వహించుచుండినచో మన యవిచ్ఛిన్నానుభవము నితరులపాలు కానేరదు. మనమిట్లూరకుండిన మన యర్థస్థానము లన్యు లాక్రమింపకుందురా! పిమ్మట కాలదోషమునకు వగచుటకంటెమన యర్థస్థానంబుల మన మప్రమత్తులమై కృతకృత్యుల మగుట శ్రేయస్కరము.

# విజ్ఞాపనం

గుణగ్రహణ పారీణులగు నో పండిత వర్యులారా!

నేనీశాస్త్రంబున గించిత్పరిశ్రమ జేసినవాడనుగాని సర్వజ్ఞుండనుగాను. లోగడ సుమారు నాలుగుమాసములక్రిందట "జ్యోతిశ్శాస్త్రము నెందుకు నమ్మవలెను" యను నొక చిన్న పుస్తకమును నాంగ్లేయభాషలో "Why Astrology should be believed" యను నామంబున రచించినాడను. మరియు నీజ్యోతిర్వినోది యందుగల కొన్ని హాంశములను నేను కొంత కాలముక్రిందట జ్యోతిషప్రకాశిక యను మాసపత్రికయందు గొంత హాస్యప్రకాశికగను మరికొంత జ్యోతిర్విషయములుగను వ్రాసి ప్రకటింపజేసినాడను. ప్రస్తుతంబున నామిత్రు లనేకులు నాహాస్యప్రకాశికను పూర్తిజేయుమని ప్రోత్సాహపఱుప దీనిని వ్రాసి జ్యోతిర్వినోదిని యని పేరిడితిని. మరియు నేను లోగడ నాంగ్లేయభాషలో రచించిన పుస్తకమునందు ప్రకటించిన, నేను వ్రాయబూను గ్రంథములును, మరికొన్నితరముఖ్య జాతకగ్రంథంబులగు జాతకసారావళి, అను భూతజాతక తరంగిణి, మొదలగు గ్రంథంబులను వీలువెంబడిని కొలది కాలంబులోనే నచ్చొత్తించి ప్రకటింపజేయుచున్నాడను. నేనన్యథా గ్రహించుటచేతగాని నాకు దెలిసియు ప్రమాదముచేగాని దీనియందు దప్పులున్నయెడల నభిజ్ఞులునాకు దెలియపఱచి మన్నింపగోరెదను. ద్వితీయముద్రణలో సవరించుకొనెదను.

ఇట్లు

విన్నవించు సజ్జనవిధేయుడు,

ఐ. వి. ఆర్. శర్మ.




శ్రీ పార్వతీపతయేనమః
శ్రీ మేధాదక్షిణామూర్తి సదాశివగురు పరబ్రహ్మణేనమః

జ్యోతిశ్శాస్త్రము నిజమని జెప్పు

# జ్యోతిర్వినోదిని.

ప్రథమాంకము.

1. అమృతవాక్కుల అనంతశాస్త్రిగారు.
గొప్పజ్యోతిష్కుడు (Great Astrologer.)
2. వృధావాక్కుల ఉపేంద్రరావుగారు,
గొప్పవైద్యులు (Eminent Doctor.)
బి. ఏ. యం; బి. సి. యం.

రంగము—రహదారీపడవ (House Boat.)

(ఉభయులును వారివారి స్వంతపనులనిమిత్తము స్వేచ్ఛంద పురమునుండి బయలుదేరి వెడుచూ పడవలో కలుసుకున్నారు.)

ఉపేంద్రరావు—ఓహో శాస్త్రిగారు నమస్కారమండీ యెచ్చటికి దయచేయుచున్నారు.

అనంతశాస్త్రి—ఆహా మీరా ! నేను చూడనేలేదండి. శతాయురస్తు. రాజద్వారే ద్విగ్విజయమస్తు. మనోవాంఛాఫల సిద్ధిరస్తు. నేను రాజమహేంద్రపురములో కొందరున్న హితులు

వర్తమానించగా వేడుచున్నాను. మీరుయెక్కడికి వెడుచు న్నారండి.

ఉపేం—నేనా చెన్నపట్నము వెడుచున్నాను.

అనం—అబ్బో అంతదూరమెందుకండో, మీఅబ్బాయి ని కూడా తీసుకువెడుచున్నారా యేమిటి.

ఉపేం—మాఅబ్బాయి చూడికుడుతరావు యీసంవత్సరము మెట్రిక్యులేషను పరీక్ష ప్యాసుకాలేదండి. మెడ్రాసులో చదివించుటకు తీసుకువెళ్ళి వొప్పగించుచున్నాను.

అనం—ఏమండో మీఅబ్బాయి నెలరోజులక్రిందట తను పరీక్షయిచ్చివచ్చినానని అది ప్యాసవుతుందో లేదో అని న్నే నన్ను అడిగినాడు. నేను గ్రిహస్థితి ఆలోచించి యీసంవత్సరము ప్యాసుకాదని చెప్పినాను. అలాగుననే అయినది.

ఉపే—అలాగున అశుభం ఎందుకుపలికినారండి ముందుగా "శుభంపలకరా మంకెన్నా" అను సామెత వినలేదాయేమి.

అనం—నేను అబద్ధము చెప్పడము యిష్టములేక నిజము చెప్పినాను. ఒకసారి అబద్ధము చెపితే రెండవనాడి నమ్ముతారా? "మాచేవోలా" అన్వాని, మీఅబ్బది అశ్వనీనక్షత్రమైనది. అందువల్ల మేషము రాశియైనది. కనుక యిప్పుడు జన్మమందు శనియును, అష్టమమందు గురుసూర్యులును వున్నారు. ఇప్పుడు "ఏలినాటిశని" అనగా ఏడుసంవత్సరములున్నరా శనియని యర్థము.

శ్లో॥ ద్వాదశాష్టమజన్మస్థ శన్యార్కాంగారకాగురుః।
కుర్వంతిప్రాణసందేహం స్థానభ్రష్టంధనక్షయం॥

అనియున్నది. అందువల్ల గ్రహస్థితిబాగులేదనిచెప్పినాను. చూడండీ యింకా ద్రిప్పిద్రిప్పి కొడుతుంది. జన్మశని పలితేవట కు నీలాచిక్కులు పెడుతూనేవుంటుంది.

ఉపేం—(పై మాటలు కర్ణ కఠోరములుగ నెంచుకొని యాగ్రహపడి కళ్ళెర్రజేసి నోరుచప్పళించి) జ్యోతిశ్శాస్త్రమును నేనునమ్మనండీ స్టూపెడ్డు జ్యోతిషము. నాన్సెన్సు. అబద్ధము చెప్పి డబ్బులాగుతుంటారు. మావాడికి పరీక్షకుపూర్వము నెల రోజులక్రిందట జబ్బుచేసినది. అందుచల్లచదువు బాగా జరుగ లేదు. చదివితే ప్యాసే అగును. (అని జ్యోతిషమును నిందిం చుచు కోపదృష్టితో పలికెను.

అనం—ఓహో యీయనకు కోపంవచ్చినదే "నిజము చెపితే నిష్ఠూరము" నన్నట్టుంయ్యెను. అబద్ధముచెప్పితే మనజ్యోతిషమును మనలను నెవరును నమ్మరాయెను. (అని తనలో తను అనుకొని మంచిమాటలతో వినయముగ (ఉపేం ద్రరావుగారూ, జోతిషమంటే యీశ్వరుడే గనుక భగవంతు ని తిట్టినట్టేయగును. మంచిదకాదు. జ్యోతిష్కులను, నన్ను తిట్టినారు బాగానేయున్నది. అయితే నేను మీవాడికి గ్రహ స్థితి చాలదుగనుక నిజముచెప్పినాను. ఇంకా యింతటితోవదలి పెట్టదు సుమండి.

మధ్యమధ్య జబ్బుచేస్తూనే డబ్బుఖర్చు యెక్కువఅవుతుంది. స్థానచలనముకూడా అవుతుంది. చూడండి నాజ్యోతిషము.

ఉపేం——అయ్యో నిజమేమో యింకా చిక్కులుగలుగుతవి అంటూయున్నాడే? మాఅబ్బాయికి జబ్బుకూడా చేస్తుంది అనిఅన్నాడు. ఇదేమికొంపములుగునో? (అని విచారించుచు స్థైర్యముపూని) అయితే శాస్త్రిలుగారు యీలాగున యెన్నాళ్ళు జబ్బుచేస్తుందండీ? ప్రాణభయమురాదుగదా? జబుచేస్తే పరవాలేదు. నేను యమ్. బి. సి. యమ్. ప్యాసుచేసినాను. నాయొద్ద మంచి ఔషధములున్నవి. అవియెప్పుడునూ నాతోకూడనే యుంటూయుంటవి. (అది మందులసంచీ చూపించి) ఎన్నాళ్లకు జబ్బులు వదులుతవండి ముందయినా ప్యాసవుతాడా?

అనం——(కాస్త దారిలోకివస్తున్నాడు అనిసంతోషించుచు) మధ్యమధ్యజబ్బులుచేయుచుండుటయే కాని ప్రాణభయము రాదండి. వచ్చేసంవత్సరము బృహస్పతి తొమ్మిదింటికివస్తాడు. జన్మశని వదులుతాడు. మీవాడుతప్పక ప్యాసుఅవుతాడు చూడండి.

ఉపేం——(అప్పుడు కోపమంతయు పోయి ముఖవిలాసము గలిగి చిరునవ్వుతో) మావానికి జబ్బులేకపోతే ఫస్టుక్లాసులో ప్యాసుఅవుతాడు. మీరుచెప్పకుండనే నాకు తెలుసును. మీజ్యోతిషముమాకు అక్కరలేదు.

అనం——(కొంచెము కష్టముగానున్నను నేమియు ననక నూరకుండెను)

ఉపేం—అయితే శాస్త్రిలుగారూ పూర్వపురోజులలో నేమోగాని యిప్పుడు యింగ్లీషుచదువుకున్నవారెవరైనను జ్యోతిషమును నమ్ముతారండి. ఎవరయినను నమ్మినారా మనలో మనమాట చెప్పండి.

అనం—ఆహా అల్లాఅడుగండి చెపుతానువినండి. నమ్మకేమి యింగ్లీషుచదువుకున్నవాళ్ళె యెక్కువనమ్ముచున్నారు. ఇదియొక సైన్సుఅని వాళ్ళకు తెలుసును. మనవాళ్ళో రామారావుగారనే బి. ఏ. బియ్యల్ ప్యాసుచేసిన పెద్దప్లీడరుగారిని యెరుగుదురుగదా? ఆయనభార్య కాపురమునకువచ్చి 30 సంవత్సరములు అయినది. సంతానములేదు. పెంచుకోవలెనని యున్నది. ఇట్లుండగా నేనీమధ్య వారింటికి వెళ్ళినప్పుడు శాస్త్రిలుగారూ! ఈఆస్తిఅంతయు యెవరుతినును? మీరేమిచెప్పెదరు అని జాతకమిచ్చెను. నేనుచూచి ఆలోచించి యిప్పుడు గురుమహాదశలోరవ్యంతరము వచ్చినదండో వహ్వా! మాదొడ్డలురోజులు వచ్చినవి. ఇక రెండునెలలలో మీభార్యాగారు గర్భిణితోవుంటారు. ఒకసంవత్సరము మించకుండా మంచికొమరుడు కలుగుతాడు గనుక పెంపువిషయమై యాలోచించకండి. మానివెయ్యండి. నాజ్యోతిషంమహిమ తెలుస్తుందని చెప్పినాను. అప్పుడుసంతోషముతో ఆయన "అయ్యో. నాజాతకము మాతండ్రిగారు దగ్గరవుండి వ్రాయించినదేను. బాగా రుజువిచ్చుచున్నది. మాతండ్రి నన్ను చదువుకోవా నాయనా

నీజాతకం బాగా యోగిస్తుంది. చాలా సంపాదిస్తావు. ముందు మంచిరోజులు వస్తున్నవి. అని నాచిన్నతనములో చెప్పినారు. అప్పుడు మావాండ్ల స్థితిమెరుగుదురుగదా! జీతమిచ్చుటకు యెంత యిబ్బందిపడేవారు. అలాంటి స్థితిలో లక్ష రూపాయీల ఆస్తి సంపాదించినాను. నాజాతకం దృష్టాంతరంగానే యున్న దని " నాతో చెప్పెను. ఆప్రకారము సంవత్సరము మించకుండానే కుమారుడు గలిగినాడు. ఇప్పుడుచూడండి ఆబిడ్డ దంప లాగుననున్నాడు. భారసాలకునాకుదుశ్శాలువ బహుమతీయిచ్చి నారు (ఇదిగో చూడండి అని తన మూటలో శాలువ తీసి చూపించెను)

ఉపే౦—ఏమో ఆయన యెల్లానమ్మినారో కాని నేను యెన్నడును నమ్మను. స్టూపిడ్ను ఎస్ట్రాలిజీ ఐ నెవ్యర్ బిలీవ్ ఇస్ ఎస్ట్రాలిజీ టి మాధవరావుగారనే అయన దీనిమీదను వ్యాసము వ్రాసినారు. జ్యోతిషమెన్నడు నమ్మకూడదనిన్ని నమ్మి అనేకమందిమోసపోయినారు అనిన్ని జ్యోతిష్కులందరు రోగ్సు అనిన్ని వ్రాసియున్నారు.

అనం—అయ్యో మీకుయింత పట్టుదలయేమండీ. నిజము కనుక్కొని ఆపయిని అబద్ధమంటే బాగుండును. పప్పుకూరలు వడ్డించినపుడు తినకుండనే ఉప్పగానున్నవో చప్పగానున్నవో సరిపోయినవో చెప్పడ మెట్లున్నదో మీరు యేమి నిజం కనుక్కోకుండా జ్యోతిషం అబద్ధమనడం చాలా ఆశ్చర్యముగానున్నదండీ.

వు- ఉ—అవును. లెండి. చాలామందిచెప్పడం కూడా వైద్యశాస్త్రమెట్టునడచునో జ్యోతిశ్శాస్త్రము గూడ నట్లే నడచుననియు యిదిగూడ నొకసైన్సు అనియు, జెప్పుదురు కాని నాకుమాత్రం నమ్మకము లేదు సుమండీ. ఎందుకూ. మాడాక్టర్సు లోనే దీనిని గొంతమంది చాలగౌరవించి నమ్ముచున్నారు. మొన్నీ మధ్య నేనును ఘంటముక్కు సోమనాథరావుగారును జాలఘర్షణపడినాము. యిందువిషయంలోనే.

అ- అనం—ఆసోమనాథరావుగా రెవరండీ.

వు- ఉపేం—ఆయనాడీ. ఆయన గూడ నొకడాక్టరే లెండి. చాల తెలివైనవాడు. బహునెమ్మదిగలవాడు. అతనికీ శాస్త్రమందు నమ్మకము జాలగలదు.

అనం—మీకుతప్ప ఎవరికైనా వుంటుంది. వైద్యం మాత్రం తత్సాస్త్రంలో చెప్పిన ప్రకారం నడుస్తుందండీ. ఒక్కొక్కొప్పుడు వికటిస్తుందిగూడాను.

ఉపేం—వినండి. నేను నిజమే కనుక్కున్నాను. మా యింటికి రోజూ వేమవరం బ్రాహ్మణుడువచ్చి యాయవారము చేసుకొనేవాడు ఆయనజ్యోతిషము తెలిసినవాడేనట. ఒకరోజున నాయన జాతకమిచ్చి నాకు మాతృమారకమెప్పుడు గలుగునని అడిగినాడు. అయితే జాతకముచూచి మాతల్లిగారి కింకా 13 సంవత్సరములు ఆయుర్దాయ మున్నదని చెప్పినాడు. మాయింట్లో మాఅత్తగారు వొక వెధవావిడవున్నది.

ఆమె రోజూ యీయనకు యీయావారము వేయుచున్నది. ఆమెను మాయమ్మఅనుకున్నాడు కాబోలు. పాపము మాఅమ్మ పోయి అదివరకే 9 సంవత్సరములు అయినది. అప్పుడు యేమయ్యా బ్రాహ్మడా యీలాంటి అబద్ధమెందుకు చెప్పినావు అని అడిగి చీవాట్లు పెట్టినాను. అప్పుడా జ్యోతిష్కుడు, పంచాంగం బ్రాహ్మణుడు " చిత్తం బాబూ నాతప్పులేదు. జ్యోతిషముకు పూర్వము పార్వతీదేవి శాపమిచ్చినది. " భవంతినభవంతిచ " అని యున్నది. అందువల్ల జ్యోతిషం ఋజువుయివ్వలేదుగాని కొన్ని ఋజువు యిస్తూవున్నవి. కొన్ని ఋజువుయివ్వడంలేదు." అని చెప్పినాడు. నేను సంతోషించి నిజము చెప్పినందుకు ఆరోజు శేరుబియ్యం యిచ్చినాను.

అనం—వెధవలు అందరూ బయలుదేరి పూరాగా చదువుకోక డబ్బుకొరకు యేవోనాలుగుముక్కలు నేర్చుకొని జాతకాలుచెప్పడం ఆరంభించడము మొదలుపెట్టినప్పటినుంచి జ్యోతిషముయొక్క పరపతి చెడిపోయినదండి. ఆ వెధవనుపిలిపించండి. నాయెదుటమాట్లాడమనండి, యేమిచదువుకున్నాడో, యేమితెలుసునో, సభ చేయించండి. చదువుకొన్నను కార్యము లేదు. బుద్ధిజాడ్యము లేకుండ బుద్ధిమంచిదియయి యుండవలెను. " చదువుకున్నవానికంటె చాకలివాడుమేలు అనుసామెత వినలేదా " యెంతచదువుకున్నా తెలివితేటలు వుండవలెను.

ఉపేం—సరే మీరు ఆయనకంటె ఎక్కువచదువుకొనివచ్చును. మీరు ఆయనను తిట్టడంయెందుకు.

అసం — తిట్టాలా యింకా చెంపలు పగలకొట్టాలా యీలాటిపధకాలు బయలుదేరబట్టే కాలమీలాగున వున్నది. నేను నవద్వీపం వెళ్ళి 12 సంవత్సరములు చదువుకొన్నాను. కాశీలో కర్ణనోక్తుల కామశాస్త్రిగారివద్ద 5 సంవత్సరములు చదువుకొన్నాను. ఆపయిన జాతకము చూచి ఫలములు చెప్పడము ప్రారంభించినాను. యిగ్నంటిజవయినప్పుడు ఫలములుతప్పక సరిగా ఋజువిచ్చుచున్నవి. ఇట్టిస్థితిలో దౌర్భాగ్యులందరికి జాతకములిచ్చి ఫలములడిగితే యేమి చెప్పగలరండి.

ఉపేం — ఊః; జ్యోతిషమంతయు పోడెలెండి కొన్ని ఋజువుగా వేస్తుంటూవుంటవి. మా అత్తవారివూళ్లో వీరంపేరంటాలు గుడివున్నది. ఆగుళ్ళో ఆసాదివాడు ప్రతిఆదివారం రాత్రి నాలుగుడబ్బులున్ను అరటిపండ్లున్ను పట్టుకొని వెడితే సోదిచెప్తాడు. వాడుచెప్పేటప్పుడు నేను తమాషాకనుక్కొనుటకు వెళ్ళినాను. వాడుచెప్పడం ఆరంభించినాడు. కొన్నిమాటలు చెప్పినాడు. నేనుకదంలేదు, మెదలలేదు, నవ్వలేదు, మాట్లాడలేదు. అందువల్ల వాడు చెప్పినవి సగం ఋజువుగానే వున్నవి. అప్పుడు కనుక్కొన్నాను. వాడు యెదుట వారిముఖవిలాసమునుబట్టిన్ని చర్యలనుబట్టిన్ని చెపతాడట కొన్ని నిజంగానే వుంటవి. వాటిని మూర్ఖులునమ్ముచున్నారు.

అసం — జ్యోతిషమునమ్మేవాళ్ళను మూర్ఖులనకండి.

ఉపేం — నేను ముమ్మాటికిన్ని జ్యోతిషంనమ్మేవాళ్ళను మూర్ఖులంటాను. వాళ్ళనునమ్మడం తప్పు.

అనం——మీరు చెప్పినది సరికాదు. ఒకప్లీడరు యమ్. యల్. ప్యాసుచేసినాడు. చాలాప్రాక్టీసుపున్న వాడే. ఒకప్పుడు మీవలెనే జ్యోతిషము పరీక్ష చేయుటకు తనజాతకమును నాచేతి కిచ్చి నేను క్రిందటి నెలలో యే స్త్రీతో భోగించనో చెప్పమని ప్రశ్న అడిగినాడు. అయితే ఆయన జాతకమునకు విదశలుకట్టి యున్నవి. సప్తమందున్న రాహువుయొక్క విదశవచ్చినది. ఆరాహువును శుభులెవరును చూడడము లేదు. "రాహుణా విధవా" అను సూత్రముచే వితంతుసంగమము చేసి యుండ వలెనని చెప్పినాను. ఆయన చాలాసంతోషించి ఒకమెతుకుపట్టి చూస్తేచాలును. మీరు జ్యోతిషం బాగాచదువుకొన్న వారే చాలు యికచెప్పనక్కరలేదు. ఈసంగతిమాత్రం యెచ్చటను తెలియనివ్వకండి అని ఆయననన్ను సత్కరించినారు.

ఉపేం——ఎవరండీ ఆప్లీడరు.

అనం——(రహస్యంగా చెవిలో చెప్పును) ఎవరితోను చెప్పకండి.

ఉపేం——సరే వాడా. వాడు ముండలముఠాకోరన్న మాట పట్నమందరూ ఎరుగుదురు. వాడు అన్ని జాతుల ముండలతోను వెళ్ళేవుంటాడు. అందువల్లమీరు యేముండతో వెళ్ళినాడు అని చెప్పినను నిజమే అవుతుంది. అంతమాత్రము చేతను మీ జ్యోతిషము నేను నమ్మనండి.

అనం——ఇంకొకటివినండి. ఇంకొకతహశ్శీలుదారుగారు

బియ్యేపాస్యు చేసినవారే. ఆయనఅత్తవారు, మాఅత్తవారు ఒకటేగ్రామము. నేనుజోతిష్కుడన్న మాట బాగా యెరుగును. ఆయన యీపూరుమనుగుడుపుకు వచ్చినప్పుడు తనజాతకము యిచ్చి యోగంచెప్పమని అడిగినాడు. నీ యోగంబాగానేయున్నది. నీకు ముద్రికాయోగముపట్టినది. షష్టాధిపతి అష్టమమందు వృచ్ఛలోనున్నాడు. గొప్పయోగముపట్టి అప్పుడుచిక్కులుకూడావస్తవి అని చెప్పినాను. అంత గొప్పయోగము పట్టినప్పుడు చిక్కులువచ్చినాసరే యోగిస్తే చాలును అని అన్నాడు. తరువాత తహశీలుదారీలోవుండగా నేను చూడడమునకు వెళ్ళినాను. తనుకచేరీసావిడిలోవుండగా నేనుచూడడమునకు వెళ్లినాను. తనుకచేరీసావిడిలో కూర్చుని కచేరీచేయుచున్నాడు. నాకేసిచూచి యేమియును మాట్లాడలేదు. కాని పనితొందరకాబోలు అని అరగంటనిలువబడి పిదప నాఅంతట నేనే కూర్చున్నాను. తరువాత 11 గంటలవరకు కచేరీపనిచేసికొని లేచియింట్లోకి వెడుచూ శాస్త్రులుగారూ జోతిషంఅంటే నాకునమ్మకం లేదండి. నాకేమిచెప్పనక్కరలేదని యింట్లోకి వెళ్ళిపోయినాడు. భోజనమునకై నా వుండమనలేదు. నాకుచాలావిచారమేసినది. ఆసమీపములో ధర్మారావుగారనే నిరతాన్నప్రదాత యొక ప్లీడరుగారున్నారు. వారియింటికివెళ్ళి భోజనముచేసి పిదప యీవృత్తాంతముచెప్పగానసరే లెండివీనిమీదను లంచపుఅర్జీ వెళ్ళినది. అదివీనిత్రాడుతెంచేదే అని చెప్పినారు. తరువాత వారి

మరొన్ని రోజులకు (యీతహశ్శీలుదారుకు) సస్పెండు అయినది. అప్పుడు నన్ను గారు పిలవగా క్రమముగా ప్రశ్నఫల వృత్తాంతము వ్రాసి పంపినారు. అప్పుడు తిరిగీ పై ధర్మారావుగారి యింటికి వచ్చినాను. వెళ్ళినతెనంటే ఆయన వెనుక చేసిన మర్యాదకామీరు వెళ్ళడం వెళ్ళకండి అని చెప్పినారు. నేను వెళ్ళలేదు. అప్పుడు తహశ్శీలుదారుగారు స్వయముగా యీ ప్లీడరు ధర్మారావుగారి యింటికి వచ్చి నాకు నమస్కారము చేసి జాతకమిచ్చి యిప్పుడు గ్రహస్థితి యెల్లావున్నదనిన్ని తిరిగి నాయుద్యోగము నాకు వచ్చునాఅనిన్ని అడిగినారు. అంతజోతిషము నమ్మకము లేనివారికి జ్యోతిషం చెప్పకూడదు. నేను చెప్పను అని అన్నాను. అప్పుడు ధర్మారావుగారు యేమిటో వెనుకటిసంగతులెందుకు. యిప్పుడు పాపము చిక్కురోజులు వచ్చినవి. అని చెప్పి జాతకమిచ్చి చెప్పండిఅనికోరగా జాతకంచూచి సూక్ష్మదశలుకట్టి యిక 45 రోజులకు మీయుద్యోగము గతజీతముతో మీకిచ్చివేయుదురు. మీరు నిర్దోషిఅని అందురని చెప్పినాను. అప్పుడు తహశ్శీలుదారుగారు నను శ్లాఘించి మీరు చాలాగొప్పవారండి. మీవాక్కులు అమృతవాక్కులు గనుక మీవాక్శుద్ధిచేతనయినా నాయుద్యోగము నాకు రావలెను అని నన్ను చెయ్యిపట్టుకొని స్తోత్రము చేసినారు. అప్పుడు ధర్మారావుగారుకూడా శాస్త్రులుగారు గొప్పజ్యోతిష్కులు. వారుచెప్పినది తప్పక అవడమే. అన్నారు. ఆలాగుననే గతజీతముతో యిచ్చివేసినారు. అప్పుడు నన్ను రమ్మనుమని చెప్పినారు. వెళ్ళినాను. రు 200 లు బహుమతి యిప్పించినారు.

ఉపే—శాస్త్రులుగారూ యెవరండీ ఆతహాస్పిలుదారు గారు అని యడుగగా (రహస్యంగా చెవిలో ఫలానా వారు అని చెప్పెను.) అప్పుడు అయ్యో! వాడుటండీ వాడుశుద్ధాంచగొండి శిఫారసులువినేవాడుకూడాను. వీడిఉద్యోగంపోతుంది అనినేను చెప్పగలను. మీజ్యోతిషమెందుకు. వీడికికొద్దిరోజులలో డిస్మిస్ అవుతుందిచూడండి వాడిగుణం వాడుమానలేదు. యిప్పుడు కూడా లంచాలు దొబ్బుతూనే వున్నాడట. నేను వొకప్పుడు వీనికొడుకుకు ప్రాణంమీదికివస్తే ఆరురోజులుయింటికివెళ్ళివైద్యముచేసినాను. ఒకదమ్మిడీ అయినాయివ్వలేదు. వీడిఉద్యోగం నిలుపుకోలేడు. నేనేజ్యోతిషంచెప్పినాను చూడండి.

(అందరు నిష్క్రమించుదురు.)

ఇది ప్రథమాంకము.

## ద్వితీయాంకము.

ప్రథమరంగము. ధర్మసత్రిపు.

ప్రవేశము—దుడ్డుగంగాధరశాస్త్రి (శకండుగ్రేడుప్లీడరు. గొప్పధనికుడు)

అమృతవాక్కుల అనంతశాస్త్రి—(గొప్పజ్యోతిష్కుడు.)

కుళ్ళంకుల శాంతమూర్తి—(గొప్పవ్యవహారత.)

కు-శా—ఎవరండీ మీరు.

దు-గం—మేము బ్రాహ్మణులము.

కు-శా—అది కాదయ్యా. మీపేరేమి. మీదేవూరు.

దు-గం—మాది విజ్జేశ్వరంవద్ద మద్దూరంక. నాపేరు గంగాధరశాస్త్రి.

కు-శా—అబ్బా! మీయింటిపేరెవరయా?

దు-గం—మాయింటిపేరా; దుడ్డువారు.

కు-శా—అయితే మీవద్ద దుడ్డు చాలా వున్నట్టున్నదే? అయ్యా మీకుఏమివుద్యోగమండీ.

దు-గం—నాకాండి. నేను కొవ్వూరు మునసబు కోర్టులో శకందుగేద్రుమ్లీడరుగా నున్నాను.

కు-శా—చిత్తము. యిప్పటికి కృతార్థుడనయినానునేను? అమృతవాక్కుల అనంతశాస్త్రి—(వీరిద్దరు కూర్చున్నచోటికివచ్చి దూరముగా కూర్చుండును.)

కు-శా—అయ్యా శాస్త్రుల్లుగారు యిట్లా దయచేయండి.

దు-గం—(ఆయనవచ్చును.) ఓహో శాస్త్రుల్లుగారే. నమస్కారము.

అ-అనం—చిత్తం. చిత్తం. సర్వకార్యే దిగ్విజయమస్తు.

కు-శాం—ఏమండో గంగాధరశాస్త్రిగారు వీరు అమృతవాక్కుల అనంతశాస్త్రిగారని చాలాగొప్పజ్యోతిష్కులు. వీరి వాక్కులు కేవలము అమృతవాక్కులే.

దు-గం——సరి. నేనెఱుగనుటండి. (అనికొంతసేపూరుకుని) అయ్యా ఒకప్రశ్న చూడండి.

అ-అనం——చిత్తగించు. (అని ఎగపీల్చి ఒక పొడుముపట్టు పీల్చును)

దు-గం——ఏమిటో చాలాసేపు ఆలోచిస్తూయున్నారు?

అ-అనం——అబ్బే ఆలోచన కేముందిగాని ప్రశ్న విశేషకార్యకారిగా లేదండి.

దు-గం——నేను అనుకుంటూనేవున్నాను లెండి.

కు-శా——అయ్యా గంగాధరశాస్త్రిగారు ఏమిటండీ ఆప్రశ్న.

అ-అనం——శలవుయివ్వండి- ధనవిషయమై అడిగివున్నారు.

దు-గం——అవునండి. ఏమిటంటే యీమధ్య ఒక గృహస్తునకు కొంతసొమ్ము బదులిచ్చినాను.

అ-అనం——చిత్తం తరువాత.

కు-శా——ఎవరండయ్యా ఆగృహస్తు.

దు-గం——ఆయినా! దానవంతుల ధర్మమూర్తిగారండి.

కు-శాం——ఆయనటయ్యా. ఆయనమహాధర్మమూర్తి- దానవంతుడు- పరోపకారి- సుగుణవంతుడు- నిగర్వచూడామణి- యశోవంతుడు. ఉదారసాహసముగలవాడు.

దు-గం——ఎన్నివుంటేమన కేమండీ? మనసొమ్ముపోయిందా?

కు-శా——సరిదాని కేం లెండి. నేను కొద్దోగొప్పో బదులిచ్చినాను.

అ-అనం—ఆయ నీమధ్యపోయినట్టు విన్నానే.

దు-గం—అట్టేలేదండి. కాని జబ్బుస్థితిలోనే నున్నాడు.

దు-గం—నాతోకూడా మీరూవున్నారూ.

అ-అనం—పిమ్మట ఏమిజరిగినదయ్యా ?

దు-గం—ఏమనిచెప్పనండి. ఆయనకు చాలాఋణములు న్నవి. ఆమాట నాకిపుడు తెలిసినది. ఏమీ చేయుటకు వీలు లేదు. వ్యాజ్యం వేయుటకు వారు నాకు స్నేహితులు. ఎరిగినవారు. అందువలన ముందు ఒకరిచేత వ్యాజ్యంవేయించి తరువాత నేను వేసినాను.

కు-శా—వేజ్యంవేసినావుటయ్యా. అదికూడా ఎందుకు పోయినదానికి యిది వడ్డీయూ ఏమిటి.

దు-గం—ఏమి చెయ్యను. చెపుతానువినండి. వేజ్యం వేస్తే భయపడి త్వరగాయిస్తాడని వేసినాను.

కు-శా—అయ్యో వెర్రివాడా. ఎంతపనిచేసినావు. వేజ్యము నకే భయపడతాడా ?

దు-గం—ఒక్క వ్యాజ్యమేనా, ఎన్ని చెయ్యాలో అన్నీ చేసినాను. డిక్రీఅయినది. సుమారు రెండువందలు వదలినవి. అయితేపాపం వేజ్యము వెయ్యవద్దు ముందు మీకిస్తాను అని చెప్పినాడు సుమండీ.

కు-శం—మరిఅటువంటప్పుడు వేజ్యముఎందుకయ్యా, చేతకానివాడా? ప్లీడరువుకూడాను. అదీయిల్లాగేచేస్తూన్నావాఏమిటి.

ఆ-అనం—నాపరీక్షకు చాలా అనుకూలించినదండీ.

కు-శా—నాకూ మొదటయీాలా గేసలహాచెప్పినాడు లెండీ. ఇంకో ప్లీడరు మరిఒక వ్యవహారంలోను చివరకుమూడువందలు వదలినవి. అసలులోసహాం వచ్చేసరికి పెద్దలు దిగివచ్చినారు.

ఆ-అనం—అయ్యా! గంగాధరశాస్త్రిగారు ? మీాకూను ఆదానవంతుంధర్మమూర్తి గారికిని యేమయినా బంధుత్వముం దాయేమిటండీ.

దు-గం—అయ్యో! లేకేమి. చాలాదగ్గరబంధుత్వము. మాతోడల్లుడుగారికుమార్తెను ఆయనచెల్లెలుకొడుకునకుయిచ్చినారండీ?

ఆ-అనం—అయితే పాపముబంధుత్వములోనే యిట్లావచ్చినదండీ?

దు-గం—అవునండీ. పూర్వమునుంచికూడా మాకుమాకు బంధుత్వాలు సంబంధాలుజరుగుతూనేవున్నవి. కానియ్యండి ఎప్పటికేది రావాలో అదితప్పదు.

ఆ-అనం—ఆయన గతించకుండానే ఏదో చూడండి.

దు-గం—మొన్న వెళ్ళి మాట్లాడినాను. కొంచెమునింపాదిగా నుంటూంది. ఇస్తానని ప్రోమిస్సుచేసినాడు. కాని వ్యాజ్యం వేసినందుకు మాత్రం ఘూడించి నానాబూతులు తిట్టినాడు.

శాంతమూర్తిగారూ పరిస్థితములోనాకు మీాలాగేవచ్చినది. కానీ మీాకునగమైనా వచ్చినది. నాకదీరానట్టులోస్తుంది.

కు-శ్యాం—యింట్లో డబ్బుపెట్టికువెళ్ళి వ్యాజ్యం అని తగులపెట్టినావు. కాని అది తెలివితక్కువపని మళ్ళీ ప్లీడర్లుకూడాను (నీప్లీడరీతగులబెట్ట. లోభికిఖర్చెక్కువ, పబ్రాసికి పనిఎక్కువ అని తనలో అనుకొనును.) (ప్రకాశముగా) నాలాగునవస్తే బాగానేవుండును.

దు-గం—ఏమయ్యాశాస్త్రులుగారూ. నాసొమ్మువస్తుందండీ.

అ-అనం—మీకు పూర్తిగా రానేరదండీ.

కు-శా—అవునండీ. అభాగ్యపుపని చేసినాడండి. వూళ్లో అంతా ఆలాగే చీవాట్లుపెట్టినారట. పాపం. నిన్నలోట లోటశాస్త్రిగ్గారు చెప్పినారు.

దు-గం—మీరూ నాతోబాటే. మీరు, (అవునండీ, అని దీర్ఘము తియ్యనక్కరలేదు. "కూని దీర్ఘాలు")

కు.శా—కానియ్యండి. నేనుయింట్లోడబ్బు తగలపెట్టలేదు. వచ్చినంతవస్తుంది. రానంతరాదు. నాకువిచారంలేదు. నేను వారివల్ల ననేకుపకారములు బొందినాను. అదిగాక నేను మీకువలె అతిగడుస్తనానికిపోయి వున్నదికూడా పోగొట్టుకొనలేదు. నామట్టుకునేను కొద్దో గొప్పో జాగ్రత్తపడినాను. నువ్వేపాపం; చేతకానివాడా? దురాశదుఃఖానికి చేటన్నట్లయినది. ఒకనిచేత వ్యాజ్యంవేయించడం. నీవువెయ్యడం. నలుగురిచేత చీవాట్లూ ఎందుకు యీఅహోరింపు అంతానీకు. (నీయేడుపు నీవు ఏడవాలికాని. అని తనలో అనుకొనును.) "చెఱుపకురా చెడియెదవు" అను సామెత వినలేదాయేమి.

అ-అనం—చిత్తం. శలవు. యింకావుంటారా ?

దు-గం—ఆ వుంటాను. ఏమండో శాంతమూర్తిగారు. మీరుంటారా ?

కు-శా—ఆ నేనూ వుంటాను.

అ-అనం—చిత్తం. వుభయులవద్ద శలవు.

దు-గం } చిత్తం. నమస్కారము.
కు-శా }

అ-అనం—పునర్దర్శనమస్తు. న్యాయేన కార్యసిద్ధిరస్తు.

అ-నం—అయితే మరచిపోయినాను. ఎల్లుండిసాయింత్రం 5 గంటలకు యిచ్చటహాలులో జ్యోతిషంలోగొప్పపండితులైన కఠినోక్తుల కామశాస్త్రిగారు జ్యోతిషమపూర్వశాస్త్రమనియు పూర్ణనమ్మకముంచదగినదనియు నుపన్యాసమిచ్చెదరు. మీరు తప్పకుండావుండాలి.

దు-గం } చిత్తం. తప్పకుండా వుంటాము.
కు-శా }

---

ద్వితీయరంగము.

---

పత్రివులో వుపన్యాసమందిరము.

ప్రవేశము—కఠినోక్తుల కామశాస్త్రిగారు. నోరిఘంటావధానులుగారు. అమృతవాక్కుల అనంతశాస్త్రిగారు. గంగాధర శాస్త్రిగారుమున్నగు యింకా యితరసభికులు.

(ఉపన్యాసారంభము)

క-కా:— మహాశయులారా? ఆర్యులారా?

శ్లో॥ యస్యోదయే జగదిదం ప్రతిబోధ మేతిమధ్యస్థితే ప్రసరతి ప్రకృతి క్రియాసు । అస్తంగతే స్వపితిచోచ్ఛ్వసితైకమాత్రం భావత్రయే సజయతిప్రకటప్రభావః ॥

శ్లో॥ అరుణతరశరీరప్రోచ్ఛ్వలత్త్విడ్భిరుర్వీందివమపిచసమంతా దుజ్జ్వలామాచరంతీం । జలరుహభవపత్నీ సేవితా మిష్టసిద్ధ్యై ప్రతిదివసముపాసే ప్రేయసీమిందుమౌళేః ॥

శ్లో॥ శబ్దశాస్త్రం ముఖంజ్యోతిషం । చక్షుషీశ్రోత్రముక్తం నిరుక్తంచ కల్పఃకరౌ । యాతుశిక్షాస్యవేదాస్య సానాసికా పాదపద్మద్వయం ఛందఆద్యైర్బుధైః ॥

(సిద్ధాంతశిరోమణి)

శ్రీమద్విశ్వ జగత్కారణభూతుండును దేవాదిదేవుండును నగునప్పరమేశ్వరునివలనని యఖిలప్రపంచంబునుంకలిగె, నందు మున్ను సకలజగద్విధాతయగు పితామహుండనాదియు నశేష భోధకంబును నగు వేదంబు బ్రకటింపుచు శిక్షావ్యాకరణఛందోనిరుక్తజ్యోతిషకల్పాఖ్య తత్షడంగంబుల వెలసిల్లంజేసె నందు నేత్రరూపంబగుటచే వేదాంగప్రధానంబగు నీజ్యోతిశ్శాస్త్రమును సూర్యాదిమహోత్తములును గర్గపరాశరాది మునిసత్తములును సిద్ధాంతజాతక సంహితాదిభేదంబుల నువ్యక్తంబుగ నొనర్చి లోకోపకారంబొనర్చిరి.

ఇట్లు దేవర్షి పరంపరాగతంబై ప్రత్యక్షఫలజనకంబగుటచే నపరిహార్యంబగు నీశాస్త్రము క్రమముగ భారతవర్షీయులైదిక

సనాతనధర్మనిష్ఠులగు నార్యభట్టుల్లవరాహమిహిర బ్రహ్మగుప్త శ్రీపతిభాస్కరాచార్యాది విద్వత్కవులచేతను విక్రమార్కభోజాదిమహారాజులచేతను వృద్ధిజేయఁబడుటయేగాక సిద్ధసేనమహేంద్రసూరిప్రముఖ వేదదూషక బౌద్ధజైనాది మతస్థులచేతను రోమకయవనేశ్వరవిదేశీయవిజాతీయ విమతపండితులచేతను ఫిరోజిషాజహాంగీరుప్రముఖమహమ్మదీయచక్రవర్తులచేతనుం గూడ పరమప్రమాణంబుగ విశ్వసింపఁబడి సవిశేషంబుగ బహువిధంబులనుద్ధరింపఁబడినది. మరియు నమరికా, బ్రిటను, జర్మనీ, పారిస్సు, ప్రముఖక్రైస్తవదేశంబులంగా లూది తత్త్ర దేశీయ నాగరికజనచిత్తంబుల నాత్మాయత్తంబులంగావించి గౌరవింపఁబడుచున్నదిగదా ?

ఇట్లుండ నస్మద్దేశీయ నాగరికసోదరులలోని మతిమంతులే కొందఱు తదాదరపరాఙ్ముఖవిచారులగుటయేగాక తన్నిరాకరణధీరులగుటజూడ భారతీయభారతీభాష్పనీరపూరంబవ్వారిగ నూరనెవ్వారికి వారింపదరంబగు.

భారతసోదరులారా ? మనతోడిమానవులెల్లరు సమానస్వాభిమానమాననీయులై యన్యకీయయజ్ఞానధనంబు నార్జించి స్వస్వదేశంబులవర్ధిష్ణువులగుచుండ మనమూరక స్వస్థాన వేషభాషాద్యభిమానపూజ్యులమై యస్మత్పూర్వార్జిత వివర్ధితామూల్యజ్ఞానధనంబన్యశరణంబై కృశించుచు నదృశ్యతాసన్నావస్థనొందుచుండ నానిమీలితనేత్రులమై నిద్రాసుఖంబనుభవించుచు ధ

న్యమన్యంశమగుట భావిష్యద్బోధనమయూపభావ్య నిర్వేదపశ్చాత్తాపజనకంబుగాకుండునే. సోదరులారా ? భవిష్యద్దుఃఖకారణంబగు నీయ్యకాలనిద్రనుజ్జగింపుడు. కించిదున్మీలితనయనులై జ్యోతిర్మండలపరిభందిలకింపుడు

అకటా! ఐహికాముష్మికములం గరతలామలకంబుగా బ్రదర్శించు జ్యోతిశ్శాస్త్రగ్రంథంబులు చిరకాలము పారిచర్యమును జెందియు నిపుడు సదాలంబనము లేమి నడుగంటి చాల వఱకు నామమాత్రావశిష్టంబులైన వనుటయెంతయు శోచనీయముగానున్నది. పోగామిగిలిన గ్రంథములైనను ముద్రితములుగాక సర్వజనసులభంబులుగా లేవు. గావున నట్టిగ్రంథంబుల నెట్లయిన ముద్రించి యాంధ్రలోకంబునకీకొఱతదీర్ప మనమందరము బ్రియత్నింపవలయు, మరియు, నెవ్వనూహింపనశక్యమయిన యగోచరస్వరూపముగల్గి గుణాతీతుండై సచ్చిదానందస్వరూపుండై లోకాధారమూర్తియై బరగుచుండెనో యట్టి పరమేశ్వరుండే బరబ్రహ్మంబు. అట్టి పరబ్రహ్మంబే కాలము. అట్టి కాలమును తెలిసినవాడే జ్యోతిష్కుడు. అట్టికాలమనగానేది సర్వత్రవ్యాపించి సత్యజ్ఞానానందస్వరూపంబై యలరుచుండెడి వెల్గులగనియై యుండెనో యదియు సూర్యుండనబడును. ఆసూర్యుని తేజస్సే తక్కినగ్రహంబులును నక్షత్రములునై ప్రకాశించుచున్నవి.

ఇందులకు తార్కాణము. ఒక్కయింటియొక్కపై కప్పునకు

చిన్న రంధ్రముండునపుడు ఆరంధ్రముగుండ సూర్యుని కాంతి ఆయింటిలోనికి బ్రవేశించి భూమిన కానరికి వ్యాపించి యొక విధమైన నాళమువలె గన్పించును. అప్పుడు మనమొకమూడు పలుకలుగలగాజుఖడ్డీని (Prism) పైనాళమునందు ఆరంధ్రమున కభిముఖముగనుంచి చూచినయెడల నేడురంగులు గలిగియుండును. ఈయేడురంగులే తక్కిన యేడుగ్రహములకుం జెప్పబడిన రంగులయియున్నవి.

ఈసూర్యుడు పరమేశ్వరునియొక్క యష్టమూర్తులలో ప్రధానుడై యుండెను. చంద్రుడుగూడ యష్టమూర్తులలో నొకడే. కుజాది పంచగ్రహంబులును పంచభూతములకు నధిపతులై యుండిరి. యీపంచభూతములు గూడ నీశ్వరునియొక్క యష్టమూర్తులలోనై యున్నవి.

శ్లో॥ భూరంభాంస్యనలోనిలోంబరమహర్నాథోహిమాంశుః ।
పుమానిత్యాభాతిచరాచరాత్మకమిదంయస్యైవమూర్త్యష్టకం ।
నాన్యత్కించనవిద్యతే విమృశతో యస్మాత్పరస్మాద్విభోస్తస్మై ।
శ్రీగురుమూర్తయేనమఇదం శ్రీదక్షిణామూర్తయే ॥

“ శ్రీమత్ జగద్గురుశంకరభగవత్పాదాచార్యకృతమ్. ”

కాబట్టి యీసూర్యచంద్రులును, కుజాదిపంచగ్రహంబులును, నీశ్వరునియొక్క స్వరూపమేయై యుండెను. కనుక జ్యోతిశ్శాస్త్రమునభ్యసించి గ్రహగతులను, కాలజ్ఞానమును దెలిసికొనిన మహనీయులీశ్వరుని దెలిసికొనినవారే యగుదురు. ఋషీ

శ్వరుని మొదలగు మహానుభావులిట్టి దివ్యజ్ఞానమును కలిగియే యీగతానాగతముల నవలీలగా నుడువుచుండిరి. గనుక నిట్టి దివ్యజ్ఞానాదాయకంబగు జ్యోతిషశాస్త్రంబద్వితీయ పరబ్రహ్మం బును గుర్తెఱుంగుటకు సోపానంబై యుండుననుటకావంతయు సందియంబు లేదు.

ఈజ్యోతిషమనునది వేదముయొక్క షడంగములలో బ్రధానాంగమై వెలుంగుచున్నది.

జగత్సృష్టికర్తయగు చతురాననునివలన వేదంబులు ప్రకటింపబడియెను. వేదము "విద్" అను ధాతువునుండి పుట్టినది. "వేదయతీతివేదః" అనగా దీనివలన ధర్మాధర్మ ములు దెలియబడును. ఈవేదమునకు శ్రుతిః, ఆమ్నాయః, అనునామములు వాడుకలోనున్నవి. "శ్రూయత ఇతిశ్రుతిః" అనగా వినబడుట. (పరమేశ్వరునియందుండియే వినబడినందున) శ్రుతిః అనియుం జెప్పఁబడెను. "ఆమ్నాయః" "ఆమ్నాయతేపరం పరయే త్యామ్నాయః" అభ్యసించుటంబట్టి ఆమ్నా యమనబడెను. వల్లించుట యని యర్థము. ఈవేదమునందుం డు విషయములత్యంత శ్లాఘనీయమయినవియు నైహికాముష్మి కవిషయజ్ఞానమును బోధించునట్టివియునునై యున్నవి. లోక ములో ప్రతిమనుష్యుడును (అజ్ఞానులకు వర్తించదు) దమయిష్ట మును సాధించుకొనునాశతో బ్రవర్తించుచున్నాడు. అట్టి యిష్టమేదియన నిహపరసాధనమగు సత్కర్మయేగదా! అట్టి

సత్కర్మనుజేయుటకు వేదమును, కాలజ్ఞానమును, నాధారమై యుండెను. కనుక నట్టి కాలజ్ఞానమును దెలిసికొనుటకు జ్యోతిషమే యాధారము. జీవశరీరమునకు నేత్రమెట్టిదియో వేదశరీరమునకు జ్యోతిషమట్టిది.

శ్లో॥ శబ్దశాస్త్రంముఖంజ్యోతిషం చక్షుషీశ్రోత్రముక్తం నిరుక్తంచకల్పఃకరౌ
యాతుశిక్షాస్యవేదాస్యసా నాసికాపాదపద్మద్వయంఛందఆద్యైర్బుధైః॥
"సిద్ధాంతశిరోమణి"

కనుక జ్యోతిషశాస్త్రమునందలి జాతకభాగమునుమున్ముందుగ దెలిసియుండవలెను. జాతకమువలన నైహికాముష్మికఫలములను గ్రహింపవచ్చును.

బ్రహ్మప్రతిజీవశరీరముయొక్క లలాటమునందు వారివారి సుకృతదుష్కృతఫలములను నక్షరపంక్తిగ వ్రాసియుంచెను. కాని వాటిని కాలజ్ఞానమును దెలిసిన జ్యోతిష్కుడు జాతకమనెడు నిర్మలనేత్రమువలన జూచి జదివివినిపించుచున్నాడు.

శ్లో॥ విధాత్రాలిఖితా యాసౌలలాటేక్షరమాలికా ।
దైవజ్ఞస్తాంపఠేద్వ్యక్తం హోరానిర్మలచక్షుషా ॥
"జాతకసారావళి"

మఱియు జాతకశాస్త్రము పురుషులకు ధనసంపాదనంబున సహాయంబును, నాపత్సముద్రంబుననోడయు, యాత్రాసమయంబున మంత్రియునగును.

శ్లో॥ అర్థార్జనేసహాయః పురుషాణామాపదర్ణవేపోతః ।
యాత్రాసమయే మంత్రీజాతకమపహాయనాస్త్యపరః ॥
"జాతకసారావళి"

1. అర్థార్థసేనహాయః॥

వర్తకము, వ్యవసాయము, విద్య, ఉద్యోగము లేక మరియొక ప్రయత్నముచేయువారికి జ్యోతిష్కుడు జాతకమును జూచిముందుమంచి శుభఫలములనిచ్చు గ్రహముల యొక్క మహాదశాంతర్దశలువచ్చుచున్నవి యనియు నప్పుడుగొప్పలాభము గలుగుననియు దలచినపని చేకూరుననియు జెప్పినపుడును,

2. ఆపదర్ణవేపోతః॥

ఎవనికైనను రాజ్యముకాని, దేశముకాని, భూములుగాని పోయియుండి, యాపత్సముద్రములో మునిగియున్నప్పుడు జ్యోతిష్కుడు జాతకముచూచి, పోయినయాస్తిగాని సొమ్ము మొదలగునవిగాని తిరిగివచ్చునని చెప్పినపుడును, ఎవనికైనను భార్యగాని సంతానముగాని పోయినపుడును, రోగపీడితుడై యుండునపుడును, దిరిగి వివాహమగుననియు, సంతానముగలుగుననియు, నారోగ్యముగలుగుననియు, జెప్పినపుడును.

3. యాత్రాసమయేమంత్రీ:

యాత్రాసమయమునందే దిక్కునకుబోయిన జయమగునో యెట్టివేళను వెడలిన తలచినకార్యము సఫలమగునో చెప్పినపుడును బ్రితివారికిని నొకవిధమైనయాశయు, మనోల్లాసము, (Encouragement) గలిగి బహుధైర్యముగ నుందురు. అట్టిధైర్యమువలన సాహసముగలిగి తాముచేయునన్ని పనులును నన్నియత్నములును పట్టుదలతోడను జేయుటసంభవించును.

అందువలన బ్రిటిషువారికిని దామునేయుప్రయత్నమును, కోరికలును నీడేరి సఫలమగును.

తమ హిందూదేశపట్టాభిషేకోత్సవోన్ముఖులగు శ్రీ జార్జి చక్రవర్తిగారు తొలుత 1911 నవంబరు 9-వ తేది గురువారమున హిందూదేశమునకు బయలుదేరుటకు నిశ్చయించుకొనిరి. ఆ దినము తండ్రిగారి పుట్టినదినముగాన తల్లిగారి యాజ్ఞననుసరించి ప్రయాణము మానిరి. పిదప 10-వ తేది శుక్రవారము నావికులకు ప్రయాణమున కశుభదినంబని నుడువుటచేతను నాదినంబును వర్జించిరి. 11-వ తేది శనివారమునాడభిజిన్ముహూర్తంబు ననే సాధ్వీరత్నంబగు మేరీరాణీసమేతులై బయలుదేరి నిటకు విచ్చేసి యనేక సామంతరాజులును, తమరాజకీయోద్యోగులును, నితరరాజప్రతినిధులును పరివేష్టింప, దేవపరిగణమధ్యంబున నాసుధర్మాపీఠంబు నలంకరించు శచీపురందరులంబోలె ప్రకాశించుచు పట్టభద్రులై మగుడ క్షేమంబుగ జన్మస్థానంబునకు బయనమై వెడలిరి.

వేదములు నిజమనియు భగవంతుడున్నాడనియు ప్రత్యక్షముగ నెవరివలన దెలియునో యట్టి శ్రీరాములవారును, శ్రీకృష్ణమూర్తియును మొదలగు నీశ్వరాంశసంభూతులును, ధర్మరాజు అర్జునుడు మొదలగు దేవతాంశసంభూతులును మతోద్ధారకులును గురువులును నగు శ్రీ ఆదిశంకరులు, నీలకంఠులు, రామానుజులు మధ్వాచార్యులు, అప్పయ దీక్షితులు మొదలగువారును జాతకములను గలిగియుండిరి.

ఇకను క్రీస్తుమతస్థాపకుడై, క్రీస్తుమతగ్రంథములచే దేవుని కుమారుడని చెప్పబడు యేసుక్రీస్తునకును, క్రీస్తుమతావలంబులును, క్రీస్తుమతసంరక్షకబిరుదాంకితులును నగు కీర్తిశేషులైన శ్రీశ్రీశ్రీ విక్టోరియా మహారాణీ, సప్తమయెడ్వర్డు చక్రవర్తులకును, మనప్రస్తుతసార్వభౌములగు శ్రీ మేరిసమేత జార్జి V నకును, వీరిరాజకుటుంబములోనివారికిని, వీరికి నివాసయోగ్యమయి రాజధానిగనున్న శ్రీ లండను మహానగరముకునుగూడ జాతకములున్నవి.

ఇదియునుంగాక డెన్మార్కు, స్వీడను, గ్రీసు, ఇటలీ రాజులకును, రష్యా, జపాను చక్రవర్తులకును, ఒలివరు క్రామ్వెల్. నెపోలియను బోనపార్టు మొదలగువారికిని ప్రస్తుతములో బాలగంగాధరటిలక్, ఏనిబిసెంటుగారు మొన్నగువారికిని జాతకములున్నవి.

వీరేకాక మహమ్మదీయులుగూడ జ్యోతిశ్శాస్త్రము నిజమనియును, జాతకములు సప్రమాణములనియును, ఋజువిచ్చునవియును, నమ్మియుండిరి. వీరిలోగూడ నీశాస్త్రమును దెలిసిన మహనీయులుకొందఱుగలరు. వీరును ఋషులవలె బూజింపబడుచుండిరి.

శ్లో॥ మ్లేచ్ఛాహియవనాస్తేషుసమ్యక్శాస్త్రమిదంస్థితం
ఋషివత్తేపిపూజ్యంతేకింపునర్దైవవిద్విజః ॥

“ గర్గవచనము. ”

యవనాచార్యులనువారు వృద్ధయవనజాతకమును, యవన తాజికమును మొదలగు జ్యోతిషగ్రంథములు జేసియుండిరి.

ఫిరోజిషాహను మహమ్మదీయ చక్రవర్తికి జాతకముండెను వీనియొద్దను మహేంద్రసూరియను బౌద్ధజ్యోతిష్కుడుండి నా శాస్త్రమందు పెక్కుగ్రంథములు రచియించెను.

జహీంగీరను మొగలాయి చక్రవర్తికిని జాతకముండెను.

షాజహాను కుమారుడగు షుజాయనువానికిని జాతకముండెను. వీనియొద్దను బలభద్రుడను జ్యోతిష్కుడుండి హోరారత్నమును, హాయనరత్నమును నను జ్యోతిషగ్రంథములు రచియించియుండెను.

ఈపై వారికి జాతకములున్నవనుట కాశ్చర్యముకాదు.

భగవంతునియందును, వేదములయందును నమ్మకములేనట్టి బౌద్ధులకుగూడ జాతకములున్నట్టును జాతకశాస్త్రమును నమ్మి నట్లును గనుపడుచున్నది.

సుమారు 2500 సంవత్సరములకు క్రిందట హిమవత్పర్వతమునకు దక్షిణమందున్న నేపాళదేశములో రోహిణీనదీతీరమందు కపిలవాస్తువను గ్రామముండెను. ఈ గ్రామమును శుద్ధోదనుడను రాజుపాలించుచుండెను. ఇతనికి మాయాదేవియను భార్యగలదు. ఈమెయందు శుద్ధోదనునకు పుత్రుడుగలిగెను. ఈ పుత్రునకు సర్వార్థసిద్ధుడని నామకరణం బొనర్చిరి. అప్పుడక్కడనుండు బౌద్ధజ్యోతిష్కుడగు “అసితఋషి” చేతను జాతక

ము వ్రాసియుంచిరి. ఆజాతకమునుజూచి తుషితలోకవాసియైన ప్రభాపాలు డిట్లవతరించెననియు నీశిశువునకు దేవతాలక్షణంబులు ముప్పదిరెండును, మనుష్యలక్షణము లెనుబదియును గలవనియును లోకమంతయు నుద్ధరింపదగిన మతాచార్యుడగు ననియును, మతమును స్థాపించుననియు మొదలగు ఫలములు చెప్పెను. ఈజాతకప్రకారము సర్వార్థసిద్ధుడు సకలవిద్యలనేర్చి బోధివృక్షము (రావిచెట్టు) క్రింద వీరాసనస్థుడై నిమీలితలోచనుండై నిష్ఠాగరిష్ఠతనుబొందియుండుటవలన బుద్ధుడని పేరువహించెను. ఈయనయే బౌద్ధమతమును స్థాపించెను. మఱియు లంకాపట్టణమందు "అనవమదర్శి" యను బౌద్ధుడు జ్యోతిష్కుడుగనుండి "దైవజ్ఞకామధేనువు" అను జ్యోతిషగ్రంథమును రచియించెను.

సిద్ధసేనుడు మొదలగు బౌద్ధులును, జైనులును ననేక జ్యోతిషగ్రంథములు జేసియుండిరి.

కనుక సర్వజనసమ్మతంబై యాదరణంబొందిన యీ జ్యోతిశ్శాస్త్ర మన్నిశాస్త్రములకును మూలమయియున్నది.
(Astrology is the root of all sciences.)

(ముద్దు గంగాధరశాస్త్రిగారు లేచి) మహాశయులారా! నేటితో యీసభ ముగిసినది. తిరిగి రేపటిదినమున యిచ్చటనే అమృతవాక్కుల అనంతశాస్త్రిగారు జ్యోతిశ్శాస్త్రము నమ్మతగినదనియు దానివలన వచ్చులాభములనుగూర్చియు, వృథా

వాక్కుల ఉపేంద్రరావుగారు తచ్ఛాస్త్రమును నమ్మగూడదని యు అందువలన నష్టములు జాలగలవనియు ఉపన్యసించుదురు. కలినోక్తులకామశాస్త్రిగారు అగ్రాసనాధిపత్యము వహించెదరు. కాన తమరందరు రాగలందులకు ప్రార్థితులు. మఱియు కుశ్శం కుల శాంతమూర్తిగారు లండను మహానగరమున ఆల్ఫ్రెడ్ హెంచ్ బార్లెగారు యిచ్చిన ఉపన్యాసమును తెలిగించి ఎల్లుండి యిచ్చట జదువుదురు.

(అందరు వెళ్ళిపోవుచుండగ)

అ-అనం——ఏమండోయి గంగాధరశాస్త్రిగారు.

దు-గంగా——ఎవరువారు.

అ-అనం——నేనండోయి.

దు-గంగా——మీరా?

అ-అనం——మొన్న మీరు నాతో చెప్పినసొమ్ము తరువాయి ఏమయినది.

దు-గం——ఇంకా ఏమీకాలేదు. సొమ్ము రాదనితోస్తుంది.

అ-అనం——నే చెప్ప లేదండి. ప్రశ్న బలం అట్లావున్నది.

దు-గంగా——చిత్తం. తిరిగి రేపుకలుసుకుందము.

(అందరు వెడలిపోవుదురు)

ఇది ద్వితీయాంకము.

శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషానిలయము

సుల్తాన్ బజార్, హైదరాబాద్. 1.

## తృతీయాంకము.

---

### రంగము—ధర్మసత్రివు.

ప్రవేశము:—దుడ్డు గంగాధరశాస్త్రిగారు, అమృతవాక్కుల అనంతశాస్త్రిగారు, వృథావాక్కు ఉపేంద్రరావుగారు, కుశ్శంకల శాంతమూర్తిగారు, కఠినోక్తుల కామ శాస్త్రిగారు, నోరి ఘంటావధానులు గారు యితర సభికులు.

అ-అనం—మహాజనులారా! పూర్వ మీజ్యోతిశ్శాస్త్రి మపారపాండిత్యముగలిగినట్టియు, ధీమంతులగునట్టియు మహానుభావులచేతను మహాఋషులచేతను నభ్యసింపబడియున్నది. ప్రస్తుత కాలమందుగూడ ననేకులు బుద్ధిమంతు లీశాస్త్రివిషయమై పరిశ్రమజేయుచున్నారు. ఈశాస్త్రిము అభ్యసించుటకు విశేషబుద్ధికుశలతయు విశేష ఆలోచనయు నగత్యములై యున్నవి. కనుక యీశాస్త్రిభ్యాసముచే మనస్సునందును బుద్ధియందును ఆలోచనయందును గల మాంద్యమును బోగొట్టి చురుకుదనమును బుట్టించును భూమియొక్కయు భూమియందు నివశించు మనుష్యులయొక్కయు వ్యవహారవిశేషము లెప్పుడెప్పు డెట్లుజరుగుచుండునో తెలిసికొనుటకయి తగిన సాధనము లీశాస్త్రమును నిర్మలబుద్ధితో పరిశీలించినయెడల గుర్తింపవచ్చును. ప్రపంచములో ప్రస్తుతము నభ్యసింపబడు శాస్త్రిము

అన్నిటికన్న నీశాస్త్రాభ్యాసముచే మనకును నీప్రపంచము నకును నెట్టిసంబంధము నెంతవఱకు గలదో దానిని సులువుగా దెలిసికొనుటకు దగిన యవకాశముగలదు. ఈశాస్త్రము నభ్య సించుటచే ఆత్మతత్వవిద్య (Psychology) యందుగల రహస్య ములను దెలిసికొనవచ్చును. ఒక సామాన్యుని మనస్సునకీ శాస్త్రాభ్యాసము జేయుటచే విశేష బుద్ధికుశలత కల్గుటయేగాక నీప్రపంచకమందు జరుగుచుండు ప్రతివిషయమును నివసించు జంతుజాలములు మొదలగునవియును సర్వవ్యాపకుడైన నీశ్వ రుని యాజ్ఞానుసారముగ జరుగుచున్నవని తెలిసికొనగలడు. ఈశాస్త్రము ప్రతిమనుజునియొక్క పరిణామస్థానమును దెలు పును. ఈప్రపంచములో తాను నేర్చుకొనవలసిన యంశము లును తానితరులకు జేయవలసిన విధాయికత్వములునుగూడ దెలుపును. ఈప్రపంచకములో మనుజుడు తానెవరిని తనకం టె నెక్కువగా జూచుకొనవలయునో యవరిని తనతో సమాను నిగా నెంచవలయునో యెట్టివానిని తనకంటె తక్కువగా నెంచు కుని వానికిసహాయ మొనర్పవలయునో నీశాస్త్రమువలననే తెలిసికొనగలుగును. ఈశాస్త్రము అభ్యసించుటవలన సర్వపరి పాలకుండైన భగవంతునియందు వృద్ధియగుటయేగాక తాను కిందటి జన్మమందుజేసిన శుభాశుభకర్మలను ననుసరించియే ఈజన్మమందు తనకు శుభాశుభములు గలుగుచున్నవని తెలిసి కొనగలుగును. ఈశాస్త్రము నభ్యసించుటచే ప్రతిమనుజుడును

తనకు ప్రస్తుతమందు కలిగియున్నటువంటి స్థితిగతులలో తృప్తి గలిగియుండుటయు తన యిచ్ఛాశక్తియును మనస్సును నీశ్వరు నియందే యుపయోగించి తనస్థితిగతులను వృద్ధిపఱచుకొనుటకు మంచియవకాశమున్ను గలిగియుండును. ఎట్టివానితో స్నేహంబుగావించిన నెక్కువలాభకారియగునో మనప్రస్తుతస్థితిగతులను బట్టి మనమెట్లు నడుచుకొనవలయునో మనకు దెలియగలదు. ఈప్రపంచమందు మన మెవ్వారియెడల నిరపాయముగా ప్రేమ గల్గియుండవచ్చునో నెవరిని ప్రేమించినయెడల వారు తిరిగి మనను ప్రేమింతురో తెలిసికొనవచ్చును. మన కెవరెవరియందు మమతగలదో నెట్టివారియందు లేదో నట్లుండుటకు కారణంబులును కొందరియందు మనకు యిష్టంబును మఱికొందరి యందయిష్టంబుండుటకును కారణంబులును యీశాస్త్రము వలనే దెలియనగును. ప్రపంచమందు నేవిషయముగాని లాభముగాని నష్టముగాని సుఖముగాని దుఃఖముగాని అకస్మాత్తుగాగాని నదృష్టవశముచేగాని లభించుటలేదనియు నంతయుపూర్వకర్మమునుబట్టియే జరుగుచుండుననియు ప్రపంచములో జరుగు ప్రతివిషయమును మన మంచికొఱకే జరుగుచున్నదనియు మనము దెలిసికొనగలము. మనుజునియొక్క లక్షణములును నడవడికలును పూర్వకర్మములనుబట్టి జరుగుచుండుటచే నితరులు మనపై ననవసరముగా మోపునిందలను లక్ష్యముజేయుకుండుటకును వారి యుద్దేశ్యములను సదుద్దేశ్యములుగా భావించు

కొనుటకును మనకు శక్తిగలిగియుండును. ఈశాస్త్రమును బఠించుటచే మనము భగవంతునిలో నైక్యమును బొందుటకై ముఖ్యసాధనమైన యింద్రియనిగ్రహంబెట్లు గావించుకొనవలయునో నేర్చుకొనసమర్థులమగుదుము. మనకు జరిగిపోయినటువంటియు జరుగుచున్నటువంటియు జరుగబోవునటువంటియు మంచిచెడ్డలను వాటికి గారణములును మనయొక్క యుద్దేశ్యములను నీశాస్త్రమువలననే దెలిసికొనవచ్చును.

18. మన మనోవాక్కాయకర్మములును వాటివల్ల మనకు జరుగబోవు శుభాశుభములను దెలుపును. దూరపాలోచనముచే మనకు రాబోవు నశుభములను, కష్టములను కొంతవరకు నుపశమించునట్లు జేసికొనగలుగుదుము.

మనకెట్లు విశేష బుద్ధికుశలత గలుగునో మనయొక్క శక్తిసామర్థ్యము లెట్లుపయోగించవలయునో మన కల్పనాశక్తులనెట్లు సాధకము జేయవలయునో దెలిసికొనగలుగుదుము. మనము చేయుపనులయందుగాని నాలోచనలయందుగాని జ్ఞానశూన్యులముగాక చక్కగ మన కార్యముల నెరవేర్చుకొనుటయందు సమర్థుల మగుటయేగాక భగవద్విచారణయందు సమర్థులమగుదుము. మన పసిపిల్లను, బాలురను నెట్లు పెంచవలయునో యేవిధముగ వారిని తగినశిక్షలో నుంచవలయునో యేవిధముగా వారికి విద్యాబుద్ధుల నేర్పవలయునో తెలిసికొనవచ్చును. జ్యోతిషశాస్త్రి మభ్యసించుటచే పెద్దలయెడల భయ

భక్తులు గలుగుటయు నిరీశ్వరవాదము మాన్పించుటయు విశేష భగవద్భక్తి గలుగుటయు తటస్థించును. ఈశాస్త్రి మభ్యసించుటచే న్యాయన్యాయ వివక్షతయు గ్రిహణశక్తియు, విక్షణశక్తియు నిష్పక్షపాతత్వమును, న్యాయదృష్టియు మొదలగు సుగుణము లనేకములబ్బును. బుద్ధిమంతులయిన మనపూర్వులు ఈశాస్త్రిములోని రహస్యములనేకములు మనకుగూడ పెట్టియుంచిరి. నిర్మలమగునట్టియు పట్టుదలతో గూడినట్టియు బుద్ధితో నీశాస్త్రి మభ్యసించుటనలన గౌరవము హెచ్చగును. ఈశాస్త్రిము విశేషముగా బరిశీలించి అందలి యంతరార్థమును గ్రిహించుటచే మనోవికాసతయును జాలియును గలుగును. సమస్తజనులయందును జంతుజాలమందును ప్రేమయు స్నేహభావమున్ను విశ్వాసమున్ను గలిగియుండునట్లు జేయును. ఈశాస్త్రిము మనకు స్వశక్తి విశ్వాసమును తప్పక గలుగజేయును. ఇంతేగాక ఈశాస్త్రిజ్ఞానము నీచతనమును దుర్భలతయును, జడత్వమును బోగొట్టి యంతరజ్ఞానమును జ్ఞానవ్యక్తియును, వివేకమును గలుగజేయును. ప్రిపంచమం దెల్లరును నీశాస్త్రి మభ్యసించినయడల ప్రపంచమంతయు క్రొత్తక్రొత్త మార్పులు గల్గి జనులందరును క్రొత్తయాలోచనలును గలవారును, క్రొత్త యుద్దేశములు గలవారును నగుదురు. అట్లు జరిగినయెడల జనులందరును అన్యోన్యప్రేమగలవారై ధర్మమార్గానువర్తు లగుదురు. ఈశాస్త్రి మభ్యసించుటచే దుర్దదశలు రాకుండునట్లు

అనేక అపాంతరములు తప్పించుకొనుట కవకాశముండునట్లు
తెలివిగను, వివేకముగను నుండునట్లు నడుచుకొనవచ్చును.
వివాహవిషయములలో ప్రస్తుతము సంభవించుచున్న ననేక
దుర్దశలను తొలగించు స్త్రీ, పురుష జాతకములు పరిశీలించి
యేపురుషుని, కేస్త్రీతగియుండునో నట్టి వివాహములే జేయు
టకు మిక్కిలి యవకాశము గలిగియుండును. ఆయాదేశము
యొక్క రాజకార్యవ్యవహారము జక్కపెట్టుటకై యెటువంటి
రాజకార్యనిర్వాహకుల నేర్పర్చినయడల దేశవ్యవహారములు
జక్కగనడుచునో దేశము నెమ్మదిగనుండునో తెలిసికొనవ
చ్చును. మన శరీరము నెట్లు సంరక్షించవలెనో దేహారోగ్య
మెట్లు నిలుపకొనవలయునో నెట్టివారిని వివాహము జేసికొనిన
సౌఖ్యముగలుగునో యేదిక్కునకు ప్రయాణముచేస్ని లాభ
కారియగునో యేస్థలమందు నివాసము చేస్ని సుభమగునో భగ
వంతు నెప్పడెప్పు డారాధించవలయునో ద్రవ్యము నెట్లుఖర్చు
పెట్టవలయునో నెట్లు కూడబెట్టవలయునో మొదలగు సంగతు
లన్నియు సూచించును. ఈశాస్త్రమబద్ధమని యిదివఱకెన్న
డును, నెక్కడను నెవరిచేతను నిర్ధారణ చేయబడియుండలేదు.
అంతేగాక ఈశాస్త్రము కొంతవఱ కభ్యసించుటచేతనే దీని
యందు గౌరవమును, మనుజునియొక్క వ్యవహారములన్నియు
చక్కక తెలిసికొనుట కింతకంటె మఱియేశాస్త్రమును లేద
నియు మనముతప్పక గ్రహించుకొనగలము.

వృ-ఉ—సభికులారా ప్రస్తుతంలో అమృతవాక్కుల అనంతశాస్త్రిగారు ఉపన్యసించినది మీరందరూ వినియేయున్నారు. అందుకుతగిన సమాధానము నేను చెప్పుటకు తగిన శక్తుడను గానుగాని నాస్వానుభవమునుబట్టియు నాబుద్ధికుశలతనుబట్టియు నేనుకొన్ని విషయములు చెప్పుచున్నాడను. సావధానులై వినుడు. ఈజ్యోతిషశాస్త్రవిషయములో పూర్వము పార్వతీదేవి "భవంతి నభవంతచ," యని నొక శాపమిచ్చెననియు జ్యోతిషము ఋజువివ్వదని నొక లోకప్రతీతి కలదు. ఇదిగాక నాస్వానుభవమునుబట్టి ఈశాస్త్రము నొక సోదివంటిదని నొక్కివక్కాణింపగలను. ఇందుకు తార్కాణముగ ప్రపంచములో కోట్లకొలదిజనులు సిద్ధాంతులను బిలిపించి పంచాంగ పరిశీలించి నక్షత్రములను ముందువెనకలకుచూచి మీనమేసములు లెక్కపెట్టి ముహూర్తములుపెట్టించి వివాహములు మొదలగునవి జేయుచుండిరిగదా? ఇట్టిస్థితిలో యెంతమందిబాలస్త్రీలు వెధవలగుటలేదు. యెంతమంది పురుషులు భార్యవిహీనులగుటలేదు. ఇవిఅన్నియు మనకు నిత్యానుభవములుగదా? ఏమయ్యా అనంతశాస్త్రిగారు?

"అ-అ—చిత్తము. తమరుదారిలోకివచ్చినారు. మంచి ప్రశ్న అడిగినారు. ఇండియన్ పినల్‌కోడ్డుప్రకారం దాఖలు చేస్ని చార్జీలు యావత్తున్న "హిందూ లా" మొదలగు పత్రకారం దాఖలు కాబడిన వ్యాజ్యము లన్నియు నెగ్గుచు

న్నవా? బి. యల్. యమ్. యల్. ప్యాసైన మున్నగువారు పనిచేస్నివన్నియు నెగ్గుచున్నవా? అట్లనే జ్యోతిష్కులలో కొందరు చెప్పునవి రుజువిచ్చును. కొందరు చెప్పునవి రుజువివ్వవు. ఒకటే సెక్షను ఒకటే తీర్పుప్రకారం దాఖలు చేయబడిన వ్యాజ్యములు చార్జీలు కొన్ని గెలుచుటయు కొన్నిపోవుటయుయేల? అట్లనే యిదియు అనుసరించియున్నది. అదిగాక,

ఉపేంద్రరావుగారూ పూర్వజన్మసుకృత దుష్కృతముల నుబట్టియే నీజన్మయందు ఫలములు జరుగుచుండును. యంతియే కాని జ్యోతిషశాస్త్రము, జ్యోతిష్కులు జాతకములు క్రొత్త ఫలములు తెచ్చి పెట్టలేరు. ఇక వివాహావిషయంలో సరియైన ముహూర్తమునకు పెండ్లిసాధారణముగ జరుగుటలేదు అడావిడిగ అయినదోలేదో చూచుటయేకాని, సరియగు కాలమునకు మంగళసూత్రధారణ చేయుచున్నది ఎవరు గమనించరు. గనుక నూటికి తొంబది సరియగు ముహూర్తములకు జరుగుట లేదు. అట్టి స్థితిలో మీరు నీశాస్త్రమున నిందించకూడదు. న్యాయవాదులు (Pleaders) న్యాయ శాస్త్రమును (Law) ఎట్లు వ్యాజ్యములకు ననుసరింపజేసి (Applicable) శాస్త్ర ప్రకారం పనిజేయుదురో అట్లనే జ్యోతిష్కులు (Astrologers) జ్యోతిశ్శాస్త్రంబును(Astrology) జాతకములనుఅనుసరింపజేసి (Applicable) ఫలములు చెప్పుదురు. న్యాయవాదులు పనిజేయు కేసులు మొదలగునవి వారివారి బుద్ధికుశలతనుబట్టియు అనుభవజ్ఞానము

నుబట్టియు కేసుల నిజానిజములనుబట్టియు కొన్ని పోవుటయు, కొన్ని గెల్చుటయు ఎట్లు గలుగుచున్నవో అట్లే జ్యోతిష్కులు జెప్పుఫలములుగూడ వారివారి బుద్ధికుశలతనుబట్టియు పాండిత్య విశేషమునుబట్టియు అనుభవజ్ఞానమునుబట్టియు లగ్న నిజానిజ మునుబట్టియు కొన్ని రుజువిచ్చుటయు మరికొన్ని తప్పిపోవుటయు గలుగుచున్నవి. గనుక శాస్త్రములెన్నడును నభద్ధము గానే రవు. ఏమండీ ఉపేంద్రరావుగారూ! న్యాయవాదులు పట్టిన కేసులుకొన్ని ఓడిపోవుచున్నవిగదా! న్యాయశాస్త్రము (Law) ఎందుకు అభద్ధము కాగూడదు?

వు-పె—నేను సుమారు వెయ్యిరూప్యములు ఖర్చుపెట్టినాను. అనేకమంది జ్యోతిష్కుల కిచ్చినాను. కాని యోగ మువట్టలేదు. జ్యోతిష్కులు చెప్పినవన్నియు అబద్ధములయ్యెను. (అందరు చప్పట్లుకొట్టి నవ్వుదురు)

నో-ఘం—ఏమయ్యా ఉపేంద్రరావుగారు? మీకు యోగించకపోయినా మీజాతకముమీద యోగము లేకపోయినా జ్యోతిషమబద్ధమగునా? (షేమ్‌షేమ్‌అని చప్పట్లుకొట్టుదురు.) నేను చెప్పుతానువినండి. ఆస్తికులైనవారలు అనగా ఈశ్వరుడున్నాడని నమ్మువారు జ్యోతిషము దిరస్కరించగూడదనియు అట్లు దిరస్కరించినయెడల ఈశ్వరుని దిరష్కరించెనట్లేయని నీమధ్య లండనుమహానగరములో నొకజ్యోతిషసభలో తీర్మానించబడెను.

క-శా — మహాజనులారా! సోదరపండితులారా! నేను చెప్పబోవు సంగతులలో చాల భాగము బ్రహ్మశ్రీ వేదమూర్తులయిన అమృతవాక్కుల అనంతశాస్త్రిగారు, నోరి గంటావధానులుగారును చెప్పియున్నారు. ప్రస్తుతకాలములో మహారాజశ్రీ వృథావాక్కుల ఉపేంద్రరావుగారు మున్నగువారు నవనాగరికులై ఊణభాషాపండితులై నీశాస్త్రముయొక్క తుదాద్యాంతములు తెలిసికొనలేక శాస్త్రమును నిందించుచుందురు. కాని ఈమహానుభావులందరు, సిద్ధాంతభాగమునునమ్మి (Astronomy) చదివినవారై యుండిరి. కానియీసిద్ధాంతభాగము దేనినిబట్టి కనిపెట్టబడినదో మాత్రము తెలిసికొనజాలకున్నారు. సిద్ధాంతభాగము జాతభాగమునుంచియే కనిపెట్టబడియున్నది.

ఈశాస్త్రమును పూర్వమందును, యిప్పుడును నమ్మినవారును గ్రంథరచినకారులును జాతకములు కలవారును వీరిపాటి బుద్ధిమంతులుగారా? వేదదూషక బౌద్ధమతస్థులును హిందూమతమును దిరస్కరించు తురకలును విశేష నాగరికులగ నెన్నబడు ప్రస్తుతకాలమున యూరోపియనులును జాతకములును గలిగియుండిరి. జాతకగ్రంథములు రచియించియుండిరి. ఇదియునుంగాక లండనుమహానగరమునందు మూడువేల ఆరువందల జ్యోతిషపండితులుండి (3600) నచ్చటచ్చట సభలు గావింపుచుండిరి. హిమవత్ పర్వతమునకు సమీపమునేనుండి

పవిత్రంబై పుణ్యదాయకంబై ఋషీశ్వరులకు నివాసయోగ్యం బయి స్వచ్ఛంబయి ప్రవహించుచున్న గంగానదీతీరమందున్న కాశీమహానగరమందు చాలా కాలముక్రిందట స్థాపింపబడిన సెంట్రల్ హిందూకాలేజీవారు వారి కళాశాలయందు జ్యోతిషము జెప్పించుటకు యత్నించుచుండిరని తెలియవచ్చినది. మరియు లండనుమహానగరమందు నొక ఆంగ్లేయ జ్యోతిష్కుడు ఆంగ్లేయభాషలో నలుబది జాతకగ్రంథములు రచించి ప్రపంచమంతటను వ్యాపింపచేసిరి. ఆర్యావర్తనమునకు సార్వభౌముండై లండనుమహానగరమునకు రాజాధిరాజై దీనదయాపరుడై ధీశాలై మన్ననలకెక్కిన మూర్ధన్యశిరోమణి యగు మనపంచమజార్జిచంద్రుడు తన రాజధానియందుగల నొక్క జ్యోతిష్కునిచే జేయబడి ప్రకటింపబడుచున్న నొక జ్యోతిష మాసపత్రికను బంపగా దానిని నిరాకరించక వందనములతో నందుకుని పూర్ణముగజదివి సంతసించి జ్యోతిషము వృద్ధిచేయుమని ప్రోత్సాహముచేసిరని వినియున్నారము. ఇదిగాక కొంత కాలముక్రిందట లండనుమహానగరమునందు నవివివాహితయగునొక యాంగ్లేయ యువతీమణియుండెను. యామె యొకప్పుడు జ్యోతిష్కుని కలిసికొని జాతకము చెప్పమని యడిగెను. ఆజ్యోతిష్కుడు ఆనారీమణికి జాతకమువ్రాసి యామెకు నొక సంవత్సరములో వివాహమగుననియును, నామెభర్త నొకమాసములో నొకనిచేత పిడుగుద్దులుతిని చనిపోవుననియును చెప్పె

సు. అప్పుడా స్త్రీరత్న మాజ్యోతిష్కుని తిట్టి జ్యోతిశాస్త్రము నుతిరస్కరించియు, నబద్ధమనియు ప్రకటించెను; కాని యొక సంవత్సరములోగా నామెకు వివాహముగాబడి యీదంపతులు చక్కగా గాపురము చేయు కాలములో నామెభర్త యొకనాడేదోపనిమీద బజారుకుపోయి యచ్చట దెబ్బలాడుచుండెడి యొకసమూహమును జూడబోయి యందులో చిక్కువడి యా కలహకారకులచే పిడుగుద్దులుపడి యచ్చటనే చనిపోయెను. మరియు బ్రహ్మజ్ఞానమును వేదాంతజ్ఞానమును, బునరుద్ధారణ చేసి యీనద్భూమండలంబునందును బేరుప్రతిష్టలుపొంది ప్రకాశించుచున్నటువంటిన్ని హిందూదేశమునకు స్వతంత్రరాజ్యము జేకూరుటకు నష్టకష్టములనొంది హిందూమహాజనులచేత విశేషముగ గొనియాడబడుచున్నటువంటిన్ని మనయానిబిసెంటుమాతగారికిగూడ జాతకమున్నట్టున్ను నాజాతకప్రకారము నామెజీవితచారిత్రము సరిగ నడచుచున్నదనియు వినుటకు సంతసించుచున్నారము. ఇదిగాక యూరపు అమెరికాఖండములలో మొత్తము 480000 జ్యోతిష్కులుండిరని తెలియవచ్చుచున్నది. మరియు జ్యోతిశ్శాస్త్రము చాలగొప్పశాస్త్రము. ఇది యంతయు పండ్రెండు రాసులలోను, తొమ్మిదిగ్రహములయందును, నిమడ్చబడియుండెను. అదియే జాతకమనబడును. గనుక యీపండ్రెండు రాసులనుబట్టియు నవగ్రహములను బట్టియు, భూతభవిష్యత్తు వర్తమానములను జెప్పువారు తప్పకజ్ఞానులే.

జ్ఞానులకు తక్క యితరులకు నసాధ్యము. ఈశాస్త్రమును బూర్ణముగ జదివినవారుగాని జ్ఞానులు కాలేరు. నేటి కింతతో ముగించుచున్నాడను.

దు-గం—(లేచి) సోదరులారా! నేటికీసభ జరిగినది. రేపు సాయంకాలము తిరిగి యిచ్చటను కుశ్శంకుల శాంతమూర్తి గారు లండనుమహానగరములో ఆల్ ఫ్రెడ్డు హెంచ్చి బార్లె అను వారు "నేనెందుకు జ్యోతిష్కునిగనున్నాను" అనుదానినిగురించి యిచ్చిన యుపన్యాసము మనకు వినిపించెదరు. గాన తమరందరు దయచేయ బ్రార్థితులు. (అందరు వెడలిపోవుదురు.)

(ఇది తృతీయాంకము.)

## చతుర్థాంకము.

### ప్రథమరంగము.

(ప్రవేశము)

కర్ణనోక్తుల కామశాస్త్రిగారు (సభాధ్యక్షుడు) కుశ్శంకల శాంతమూర్తిగారు (ఉపన్యాసకుడు) దుడ్డు గంగాధరశాస్త్రి గారు, అమృతవాక్కుల అనంతశాస్త్రిగారు, వృథావాక్కుల ఉపేంద్రరావుగారు, నోరి ఘంటావధానులుగారు, మున్నగు వారు సభికులు.

కు-శా౹—సభికులారా! శ్రీకరంబై, సకలసంపదలకు నాకరంబై ధనంబున నాధనదుని నగరంబగు నలకాపట్టణంబును, హసించుచు సకలైశ్వర్యంబుల నాయమరనాయకుని పురియగు నమరావతిని దిరస్కరించుచు, బ్రిటిషు రాజ్యమునకు రాజధానియైన లండనుమహానగరమునందుండు నొక జ్యోతిష సంఘమునకు "నేనెందుకుజ్యోతిష్కుడుగనున్నాను." అనుదానిని గురించి ఆల్ఫ్రెడ్డుహెచ్చిబార్లే (Alfred. H. Barlay) అనువారిచే యీక్రింది నుపన్యాసము జదువబడి "అర్థరుమి" (Arthermee) అను వారిచే బలపర్చడమైనది.

నేను ప్రప్రథమమున జ్యోతిషమన నేమియు నెఱుంగను; అట్టిస్థితిలో 1899 వ సంవత్సరము మెయి నెలలో నొకనాటి సాయంకాలంబున జ్యోతిషశాస్త్రంబున నిధియగు ఏలన్ లియో (Alanleo) అనువాని యింటియొద్ద నొక జ్యోతిషమహాసభ జరిగెను. అప్పుడు నాస్నేహితులలోనొక డాసభకు వెడలుదమని నన్ను ప్రోత్సాహము జేయ నాతనిమాటం ద్రోసివేయంజాలక కొంచెము కాలము మాత్రమే యచ్చటనుండి తిరిగివచ్చునూహతో బయనమై వెడలితిని. అప్పటికి నాకు జోతిషమంత యయిష్టమయినది మఱియేదియును లేదు. నేనచ్చట గూర్చుండియుండు సమయంబున నొకయుపన్యాసకుడొక నల్లపలక (Black Board) మీదనొక యాకృతిని వేసి దానినిగురించి చెప్పుచుండెను. కాని నాయాకృతిగాని దానినిగూర్చి యాయన చెప్పునదికాని యావం

తయు నాకు దెలియలేదు. అయినను నాయుపన్యాసము పూర్తి యగువఱకునుండి వెడలుట మంచిదియని నాకుతోఁచి యెట్లో యంతదనుక కాలము గడిపితిని. తుదకుఁ జెప్పిన దంతయుఁజూడ యీయుపన్యాసకుని చమత్కృతిగాని వేఱొకటిగాదని నాకు మొదట బొడమెను. తరువాత నాయుపన్యాసకుఁ డీదిగువబాం దుపఱచిన నుపన్యాసంబు తిరిగి జెప్పనారంభించెను.

"నేనిదివఱకు నిరువదియేడు సంవత్సరములనుంచి యీశాస్త్రమునందభిరుచిగలిగి పాటుపడి కొంతవఱకు పఠనముజేసినను నింకను దృప్తిజెందనయితిని: ఏలనన నీప్రపంచమునందు స్వభావసిద్ధముగ నేవస్తువెట్లు చేయబడినదో యది యెట్లుభేదింపబడునో నాకు తెలియదు. అందువలననే ప్రకృతిశాస్త్రజ్ఞులును బరస్పరము భిన్నాభిప్రాయులై యుండిరి. ఎందుకనన నేవస్తువులు నేయేవస్తువులుగ మాఱునో యది ప్రకృతిశాస్త్రమువలన దెలియగలదు. అదియునుంగాక యేశాస్త్రమునునైనా బూర్ణముగ జదివినయెడల కొంతకాలమునకు బూర్ణపండితుడు కావచ్చునుకాని యీజ్యోతిషశాస్త్రము నెంత జదివినను మహాసముద్రమువలె దరియు నంచులేక సంపూర్ణపాండిత్యము నొందజాలదు. అందువలన నీశాస్త్రమనాదరణమును బొందుచున్నయది."

ఈయుపన్యాసకుఁ డుపన్యాసమును జెప్పుచుండగ నామానసంబునందనేక యూహలు వొడమ యాయన చెప్పినదంతయు నసంతుష్టిగనేయున్నది.

ఆయన యుపన్యాసమును ముగించి బాగుగ దీనినిగ్రహించనివారినందఱిని తమకేమయిన సంశయములున్న నడుగుమని వక్కాణించెను. నాకీశాస్త్రమునందేమియు పరిచయము లేకపోవుటచే నేను నెమ్మదిగకూర్చుంటిని. ఈశాస్త్రమునందు పరిచయము గలవారందరు కొన్ని ప్రశ్నల నడుగనారంభింప నాయుపన్యాసకునిచే సరసముగను, సహేతుకముగను నుత్తరువు లీయబడెను. ఇదంతయుజూడ నాకద్భుతముగ నుండెను.

ఇట్టి యుపన్యాసము వినిన నమ్మకములేనట్టియు, తృప్తి లేనట్టియు నవనాగరికులుగూడ శ్రద్ధతోను, బట్టుదలతోడను, జ్యోతిషశాస్త్ర మభ్యసించక మానరు.

ఆయుపన్యాసకుడు చెప్పినదంతయు నక్కడికి వచ్చినవారికందరిలోను గొందఱికి తెలిసినయంశములే; మఱికొందరికి దెలియనివైనను దెలిసికొనదగిన యంశములై యున్నవి. కాని నాకు మాత్రమన్నియు నూతనాంశములై యున్నవి. అయిన నక్కడికి వచ్చినవారడిగిన ప్రశ్నలును. నుపన్యాసకుడిచ్చిన నుత్తరములను జూడ నేనత్యంత హాశ్చర్యమనస్కుండనైతిని.

నాకు భచక్రముయొక్క రాసులైనను దెలియకపోయినను నానిమిషముమొదలు జ్యోతిషమందు నమ్మకము గలిగి యభ్యసింప నారంభించితిని. నేనును నాయుపన్యాసకుని నొక ప్రశ్ననడిగితిని. దానికివారు సమాధానము జెప్పెనుకాని యది నాకు తృప్తికరముగలేదు. పిమ్మట నాతనివెనుకనుంచి యొక

ధ్వనివినపడెను. అది నేనడిగినప్రశ్నకు సమాధానమైయుండెను. మిస్ లియో (Miss Leo) యనునామె నాప్రశ్నవిని యందుకు సదుత్తర మిచ్చెను. ఇదియేనాకు పెద్దపాఠమయి యున్నది; ఒకప్పు డెంతగొప్పవారికైనను దోచని యూహాలు సామాన్యులకు దోచవచ్చును.

సభముగిసినతరువాత నేనొక షిల్లింగు వెచ్చించి యొక చిన్న జ్యోతిషపుస్తకమును గొంటిని. ఇది నాకుదెలియకపోయి నప్పటికిని పెద్దపుస్తకముకాదు. గనుక నారోజు పరుండుటకు ముందే దాని నంతయును జదివితిని. పుస్తకముయొక్క రీతి కొంచెము తెలిసినది.

ఒకనెల యయినతరువాత జ్యోతిషవిషయమై మఱియొకయుపన్యాసము జరిగినప్పుడు నేనుదానికి వెడలితిని. అదినాకు బాగుగ దెలసినది. అప్పటినుండియు నాకు విశేషనమ్మకము గలిగినది. నేనప్పుడే యయిదు షిల్లింగులిచ్చి నాజాతకమునకు ఫలములు జెప్పుమనియడుగ వారు మఱుచటి యాదివారము చెప్పెదము రమ్మనమన నారోజుకు వెడలితిని. నాజాతకము చూచి ఫలముచెప్పిరి. అవిస్వానుభవముగ నున్నవి. పన్నెండు రాసులుగలగి బండికుండవలెనున్న యొకచక్రమునం దెట్టిసిరాతో నవగ్రహములుమాత్రము వేయబడియున్నంతమాత్రమున నది చూడగనే యిట్టి ఫలములు చెప్పుటజూడ నాకుమిక్కిలి యద్భుతముగ గన్పించినది. నాకు గతమంతయు జక్కగ బుజు

వైనది. భవిష్యత్తునుగురించి యిప్పుడేమియు జెప్పుటకు నవకాశము లేదు. నాకుజెప్పిన విషయములలోగొన్ని నామనస్సునకుతప్ప నితరులకు దెలియవు. చక్రమును నందు గ్రహములను చూచినంతమాత్రమున గ్రహనక్షత్రాదు లిట్టిఫలముల నిచ్చునని యెవరైనను నేలాగున దెలిసికొనగలరు.

ఇట్టి జన్మచక్రమును జూచినంతమాత్రమున ఫలములు జెప్పుట సాధ్యమైనయెడల నేనిది నేర్చుకొనువఱకు నత్యంతాతురతను గలిగియుండితిని. ఇట్లుచెప్పుట యీమనిషికిమాత్రము చేతనయినప్పుడు నాకుమాత్రము చేతగాదని, నేను తలచను. ఇటువంటివిషయములు తెలిసికొనుటకు నొకరిని నమ్ముకొని యుండుటకంటె నేను దీనిని తెలిసికొనుటకే యిచ్ఛగించితిని. ఇందువలన "నేను స్వతంత్రుడననియు, స్వాతిశయము గలవాడననియు," నాకు జ్యోతిష్కుడు చెప్పినది నిజమయ్యెను. నేనప్పటినుండియు జ్యోతిషము బహుజాగ్రతతో జదువుచుండితిని. నేనింతులోనొక పెద్దపుస్తకమును నిఘంటు సంపాదించితిని. ఇది నేను బోధపఱుచుకొనుటలో గొంతశ్రమపడి నాజాతకమును గుణించుట నేర్చితిని. పిమ్మట నాస్నేహితులలో బెక్కుమంది జాతకములు విమర్శించితిని. నేనీజాతకము లన్నియు నొకపుస్తకములో వేసికొని నేనెక్కడకు బోయినను దీసికొని వెడలుచుండితి. ఈపుస్తకము నేను గ్రామాంతరము వెళ్ళునపుడును, ధూమశకటములో నుండునపుడును, ట్రాముబండిలో నుండున

పుడును గూడనుంచుకొని నేనెఱిగినవారు తటస్థించునపుడును వారి జాతకములు విమర్శించి నేనుచదివిన యంశములన్నియు వారిజాతకములుమీద పట్టించి (Apply) చూచి యోగావ యోగము లెట్లుపట్టినవో సహేతుకముగ నరయుచుంటిని. ఇట్లుచేయుటచే నాకు జ్యోతిషమునందు కొంతజ్ఞానము కలిగి నది. నేను నేర్చుకొనినదంతయు నాజాతకముమీద యనుభవ ముచూచుటకు బ్రయత్నించితిని. ఇట్లు చేయుటచే కేవలము నాస్వలాభముకొఱకేగాదు. అనుభవజ్ఞానము కుదిరి మార్గమ ధ్యమందెవ్వరైనను తటస్థించి జాతకము చూపించినను విమర్శిం చుటకు శక్తిగలిగియుండునని చేయుచుంటిని. నాబంధువులు కొందఱు నన్నుకొన్ని విశేషములడిగి నాకు భ్రమతను గలుగ జేసినను మునపటికన్న నెక్కువ గ్రహాణశక్తి గలవాడనై యన్నిటికిని తగు సమాధానము చెప్పితిని.

నేనెట్లు జ్యోతిష్కుడనైతినో పైసంగతులవలన మీరు తెలిసికొనగలరు. ఇందులో నాయనుభవమును, నితరులయను భవమును నంతయెక్కువగా భేదించునని నేనుతలచను.

మోడరన్ ఎస్ట్రాలజీ (Modern-Astrology) ప్రథమ సంచికలో "గ్రహములు జరుగునటువంటి ఫలాఫలములను దెలియజే యునుగాని యట్టిఫలములకు గ్రహములు కారణములుకావని" గ్రీన్సు (Grenes) అనునాయన సూచించెను. ఇది నాకు కొంతయు పకారియయినది.

నాకు మొట్టమొదట "విధియిట్లున్నది" "గ్రహచారమిట్లున్నది." అని చెప్పుమాటలయం దెంతమాత్రమును నమ్మకము లేదు.

లియోగారియొక్క జోతిశ్శాస్త్రపుస్తకములు చదువుటవలన నందులో "నక్షత్రము లిచ్ఛామాత్రమును గలుగజేయునుగాని నిర్బంధమును గలుగజేయవు." అను నీవాక్యము నన్ను జ్యోతిషశాస్త్రమునందు పూర్ణలక్ష్య ముండునట్లు ప్రేరేపించెను.

నేనెందుకు జ్యోతిష్కుడ నైతినని నన్ను నేనే ప్రశ్న చేసికొనవలసివచ్చినది నేనేయుద్దేశముతో నీశాస్త్రమం దత్యంతానురాగంబుగలవాడనైతినో, దేనికొఱకు కాశించితినో యది నాకింకను లభించినదా లేదా యనియడిగిన నీక్రిందివిధముగ జెప్పవలెను. దీనిననుసరించి యొకచిన్న కథయున్నది. "ఒకనికి నలుగురు పుత్రులుండి సుఖముగ జీవించుచుండిరి. కొంతకాలమట్లుండ వారితండ్రి కవసానకాల మాసన్నమాయెను. ఆసమయంబున నాతడు తన నలువురు పుత్రులను బిలిచి యీక్రిందివిధంబున జెప్పెను. "పుత్రులారా! మీకొఱకు నేను చాలధన మార్జించితిని. ఆధనము మీరునలుగురును మీదారాపుత్రాదులతో మీయావజ్జీవమును సుఖముగజీవింపగలరు. ఆధనమును మనభూమిలో బాతిపెట్టితిని గానమీరు దానిని త్రవ్వినయెడల నది మొదట కనుబడకపోయినను రెండుమూడు

పొరులప్పటప్పట త్రివ్వి చూచికొనవలయును” అని చెప్పి చని పోయెను. తరువాత నానలుగురు పుత్రులును బిత్రాజ్ఞానుసారము భూమిని రెండుమూడు పర్యాయంబులు త్రివ్విరి కాని యందు ధనంబును గానరైరి. కాని దీనివలనభూమిని బాగుగ త్రివ్వుటవలన బూర్వముకన్న ననేకమడుంగు లధికంబుగ ఫలించుననియు, నట్లు ఫలించుటవలన విశేషధనంబు జేకూరుననియు వారుగ్రహించి యట్లు నేసేటు జేసి యపరిమిత ధనమార్జించిరి” అట్లనే నేను బహుకష్టపడి యీశాస్త్రమునుం బఠించినను ధనలాభము విశేషముగ నొందనైతిని గాని నేను సంపాదించిన లాభమేమన, యది జ్యోతిషజ్ఞానమే యైయున్నది. (జ్యోతిః= తేజస్సు: అనగా నీశ్వరుడు ఈశ్వరుని దెలిసికొనుటయే దీనిఫలము.) తండ్రియాజ్ఞప్రకారము బీడు భూమిలో ధనము దొరకునను. నాశతో వానిపుత్రులాబీడునుదున్ని త్రివ్వి పిదప ధనము నెట్లుబడిసిరో యట్లే నేనీజ్యోతిషము చదువుకొనిన ధనము వచ్చునను దలంపుతో జదివితినిగాని ధనసంపాదన కొద్దియైనను దివ్యజ్ఞానసంపాదన నెక్కువగ నొందితిని. నేనట్లు జదువుటకు బూర్వము త్రివ్విదున్నని బీడువలెనుండి యిప్పుడు నిర్మలంబై, వికసించినకమలంబుచందంబున నాహృదయంబుండెను. ఇప్పుడు నాకు ధనమార్జించ నవసరములేదు. నాకాయుద్దేశ్యమునులేదు. ఏలన నాహృదయము పరిపక్వమునొంది, దివ్యజ్ఞానదాయకుం మును, నిర్వికారుండును నిరంజనుండును నగు భగవంతునియం

దా నామనస్సులీయమై యామహామహుని తేజస్సును బొందుటకే సర్వదా యత్నించుచుండును. నేనిది యంతయు జ్యోతిశ్శాస్త్రాధ్యయనము చేయనియెడల గ్రహించలేకపోవుదును

మఱియును ప్రకృతిశాస్త్రమునుబట్టి యాలోచించినయెడల జ్యోతిశ్శాస్త్రమందు ప్రకృతిశాస్త్రము సమ్మేళనమై గన్పట్టుచున్నదని నేను నొక్కి చెప్పచున్నాను. బంగారమును సీసమును రెండును మృదువైన లోహములైనప్పటికిని రెండును గలిపి కరిగించినయెడల వెలుగలిగిన యొక మిశ్రమలోహమై విలువతగ్గిపోయి వ్యర్థమగును. ఎట్లన వృషభలగ్నమందు జననమొందిన వారికి శని భాగ్యరాజ్యాధిపతియై రవి వాహనాధిపతియై యుండిరి. వారికాయాధిపత్యము వచ్చుటవలన శుభులయి యోగించుదురు. ఏకరాసియందు గూడుకొనిన వ్యర్థమై నపకారమునే జేయుదురు. శని నలుపురంగు, రవి పీతవర్ణము ఇవి కలిసినయెడలను విరుద్ధముగ నుండును. కనుకనే జ్యోతిశ్శాస్త్రమునందు శనిరవులకు శత్రుత్వము జెప్పబడెను.

ఒక వృత్తివలన జీవించు వాయిద్యగాండ్రును (Musicians) పాటకులును (Singers) వృషభలగ్నమునందే బుట్టిరి. వాయిద్యగాండ్రకు శనిరవులు కలిసియుండుటవల్లను ధనహీనులై యుండిరి. పాటకులకు రవిశనులు కలియక వేరువేరు స్థానములయందుండుటవలన ధనవంతులుగ నుండిరి.

ఒక దేశములో రెండు రాజకీయకక్షలవా రుండుటకు

గొంత హేతువును గనుగొనుచున్నాను. రాసు (Signs) లొకటి విడిచియొకటి ధనాత్మకమును (Positive) మఱియొకటి ఋణాత్మకమును (Negative) నయియుండెను. అట్టిరాసులయొక్క ప్రాద్బలమే (వశ్యతచే) రెండుకక్షలకును హేతువై యుండును.

ప్రాణమును దేహమును నమర్చునట్టి రెండుజ్యోతిర్మండలములు మనకుగలవు. అవియేవియన సూర్యమండలమును, చంద్రమండలమునై యున్నవి. సూర్యుడు ప్రాణమును, చంద్రుడు దేహమును నిచ్చుచుండిరి. అవియే యట్టి కక్షలవారి దేహమునకు, ప్రాణమునకును నుపచరించుచుండును. పరమార్థమరసిచూడ జ్యోతిషము భగవత్సాన్నిధ్యమును గలుగజేయును. భగవంతునియొక్క సర్వోత్కృష్టత ప్రత్యక్ష ప్రమాణంబని నాకు మొఱలిడుచున్నది.

ఎవనిసాన్నిధ్యమును నేనితరులకన్న బాగుగ జేరగల్గితినో నన్ను బరిపూర్ణునిగజేసి యేది వెలబుచ్చుచున్నదో దేనివలన మతభేదములు లేక మునపటికన్న నెక్కుడు విమతసాహసముగలవాడనయితినో స్వానుభవమును బట్టిజూడ యేదినాకు నిరంతరాభిలాషము గలుగజేయుచున్నదో, యేదినాకు అజ్ఞానమను చీకటినిబోగొట్టి జ్ఞానమను వెలుతురునందు ప్రవేసింపజేయుచున్నదో యది జ్యోతిషమే యైయుండెను. జ్యోతిషశాస్త్రమును, వేదాంతశాస్త్రమును నేనభ్యసించుటవలన ఒక వస్తువుయొక్క రెండురూపములుగ గ్రహించితిని. ఒకనిమిష

మును మరియొక నిమిషమునుంచి వేఱుచేయులాగున సాకర్య మునిమిత్తముతప్ప యాలోచనయందు రెండు శాస్త్రములు వేఱుచేయజాలను. కొందఱు ఒకదానిని యెక్కువగను మరి యొకదానిని తక్కువగను జేయుచుందురు. నాకు వారియెడల విరాగము లేనప్పటికిని నిజముగ వారిరీతినాకు బోధపడుటలేదు.

జ్యోతిషశాస్త్రము లేకుండ వేదాంతశాస్త్రము లేదు. ప్రతివస్తువునకొక శాస్త్రమును, దానికొక ప్రయోజనమును కలిగియున్నది. ప్రతిశాస్త్రమునకును దానికి సంభంధించినప్రయోజనమును వస్తువును గలిగియున్నవి. వీణమొదలగువానిని నేర్చుకొనునప్పు డుపయోగింపబడు పరిభాష సంగీతశాస్త్రము లోనొకభాగమైయున్నది. గాజుగొట్టమునుచేయుట రసాయన శాస్త్రమందొక భాగమయి యుండును. గోవులు వేఱుగను, క్షీరములొకటిగను నుండునటుల ప్రకృతిశాస్త్రముకు వేదాంత శాస్త్రమును, జ్యోతిషశాస్త్రమును నొకటియే యని నేను నిశ్చయముగా జెప్పుచున్నాను. పాలలో మీగడవలె వేదాంత శాస్త్రము జ్యోతిషశాస్త్రములో నొక భాగమయి యుండెను. పై కారణములవలననే నేను జ్యోతిష్కుడగ నున్నాను. నేను చెప్పవలసినకాల మైపోయినది. గనుక నేనిందింకను జెప్పవలసి నదివున్నను పూర్తిచేయలేకపోతిని. గనుక నింతటితో విరమించుచున్నాను.

అర్థర్ మీ (Arthur Mee) యనువారిచే పైనజెప్పినదంత యు బలపరచబడెను.

నాకు జ్యోతిషశాస్త్రమునందు విశేష పాండిత్యము లేనప్పటికిని "Alfred H. Barley" అనువారు చెప్పిన యుపన్యాసమంతయును వినగానే సత్యానందము గ్న్నడ నయితిని. వారు చాల కాలమునుంచి యనేక జ్యోతిషగ్రంథములం జదివి యనేక జాతకంబులం బరిశీలించి యనుభవజ్ఞానంబును గలిగియందువలన జెప్పిన వారియుపన్యాసమును నెవరును బూర్వపక్షము జేయలేరుగదా.

నేనుగూడ నాశక్తికొలందిని కొన్ని సంగతులను జెప్పుచున్నాను.

గ్రహనక్షత్రాదుల కాంతిప్రసారముచే నీప్రపంచమునందుండు జీవకోటియంతయు బుట్టుచు గిట్టుచుండును. సూర్యకిరణములయందొక విధమైన విద్యుచ్ఛక్తి (Electricity) గలదు. ఆవిద్యుచ్ఛక్తివలననే ప్రపంచకమునందుండు జంతుజాలమంతయును వానివానికి నిర్ణయమైన పనులు చేయుచుండును. చంద్రోదయ చంద్రాస్తమానములవలన సముద్రమునకు పోటుపాటులును, పిచ్చివాండ్రకున్మాదంబులును హెచ్చుతగ్గులు గలిగించుచుండును. కుజాదిపంచగ్రహములును, పంచభూతములకు గారణమయియుండెను. గనుకనే ప్రపంచమందుండు జీవకోటికిని, గ్రహనక్షత్రాదులకును సంబంధము గలిగియుండెను. గ్రహనక్షత్రాదులు భగవత్స్వరూపమే గనుక గ్రహనక్షత్రాదులతో సంబంధించిన జ్యోతిషమును దెలిసికొనినయె

డలను భగవంతుని తెలిసికొనినట్లయని నేను నిర్మలబుద్ధితో జెప్పుచున్నాను. నాకింతకంటె యెక్కువకాలము గడువిచ్చినం దున నింతటితో విరమించుచున్నాడను.

దు-గం—(లేచి) సభికులారా? నేటితో సభపూర్తిఅయినది. మనమందరము శ్రీకామశాస్త్రిగారును అనంతశాస్త్రిగారును చెప్పినచొప్పున యీశాస్త్రమభివృద్ధికొరకు ప్రయత్నింపవలయును. (అందరు వారివారి స్వంతపనులమీద వెడలిరి)



## ద్వితీయరంగము.

ప్రవేశము—వృథావాక్కుల ఉపేంద్రరావుగారు (డాక్టరు) జటాధరరావుగారు—ఉపేంద్రరావుగారి గుమాస్తా. ఉపేంద్రరావుగారింట్లో రు 3000 ల జవాహరీ వారివంటబ్రాహ్మణుడును వడ్డిమంగలిని రాత్రిదొంగిలించి పారిపోయిరి. మరునాడుదయమున (వీరిద్దరు యింటివద్ద కూర్చుని మాట్లాడుకొనుచుండగా ఒకబంట్రోతువచ్చి టెలిగ్రాము యిచ్చును. ఉపేంద్రరావుగారు ఆతంతివార్త చూచి పడకకుర్చీమీద కూర్చుని విచారించుచుండును)

జ—ఏమండీ! ఏమిటి? ఆటెలిగ్రాము.

వృ-ఉ—ఆటెలిగ్రాము మీదపడవేసును.

జ—గోరుచుట్టుమీద రోకటిపోటు పడ్డట్టు యిదిగూడ ఏమిటి. (అని తనలో తెలిగ్రాం చదువుకొనగా నందులో ఉపేంద్రరావుగారి కుమారుడు చూడికుడుతరావునకు కొలంబో (Colombo) లో చాలజబ్బుగా నున్నట్టున్ను వెంటనే బయలు దేరి రావలయుననియున్నది.

జ—యిప్పుడు ఏమిచేద్దామండీ?

వృ-ఉ—నీశ్రాద్ధం, నాపిండాకూడూను.

జ—(అదే పెడుదుగాని తొందరపడకు అని తనలో అను కొనుచు) పరిహాశముగా అదికాదయ్యా! ముందు కర్తవ్య మేమిటి అని అడిగితే నీపిండాకూడు నాశ్రాద్ధం అని అంటా రేమిటి. మంచిమాటలే. పోనీ ఒకపనిచేస్తే

వృ-ఉ—ఏమిటది.

జ—యీవూళ్లో అమృతవాక్కుల అనంతశాస్త్రిగారని గొప్ప జ్యోతిష్కులున్నారు. ఆయనను సలహాచేసి మీఅబ్బా యికెట్లావున్నది. అడిగి నింపాదిగా వుంటుందంటే వెళ్లడం ఖూనివేసి యీపోయిన జవాహరీకి ప్రయత్నిద్దాము.

వృ-ఉ—రు 3000 ల కిమ్మతుగల జవాహరీ పోగొట్టు కోనా? పిల్లవాడిని పోగొట్టుకోనా? దిక్కుమాలినరోజులు వచ్చినవి. నీవుచెప్పినది బాగుగానే వున్నది. ఆఅమృతశాస్త్రి గారెచ్చటనున్నారు? వారితో నేను వెనుక చాలాఘర్షణప మొన్న జరిగిన వుపన్యాసములో నీజ్యోతిశ్శాస్త్రమును చాలా

నిందించినాను. వెనుక పిల్లవానికి జబ్బుచేయునని చెప్పెను. అలాగే చూడికుడుతరావునకు జబ్బుచేసినది.

జ—అయితే ఏమండీ? అవన్నియు ఇప్పుడు ఆయనకు జ్ఞాపకమా ఏమిటి. అయనా! వాక్శుద్ధి అగ్నిహోత్రావధానులుగారి యింట్లోవున్నారు.

వృ-ఉ—సరేవెళ్ళితీసుకోనిరా. (అని చెప్పగా)

జటాధరరావు వెళ్ళి ఆయనను రమ్మనమని అడుగగా నేను ఆవుపేంద్రరావుగారికిప్పుడు కావలసివచ్చినానా? నేను రానుఅని నిరాకరించును. ఇట్లాఅని జటాధరరావువచ్చి చెప్పగా ఆయన (యీఉపేంద్రరావుగారు స్వయంగా అగ్నిహోత్రావధానులుగారును అనంతశాస్త్రిగారును ఆగ్రామ దేవాలయం మందిరములో కూర్చుండగా) వెళ్ళెను.

వృ-ఉ—ఏమండోయి శాస్త్రిగారు నమస్కారము.

అ-అనం—చిత్తం దయచేయండి.

వృ-ఉ—మన ఉభయులకు యిదివరలో జరిగిన ఘర్షణకు నన్ను మీపూర్ణదయతో క్షమించి మాయింటికి ఒకసారి దయచేయగోరెదను. నేనుచాలా చెప్పరాని అవస్థలోనున్నాను.

అ-అన—మీకు జ్యోతిషం ఎందుకండీ. స్రూపెద్దజ్యోతిషం. నాంసెన్సు. జ్యోతిషంఅంతా పోదె. దీనిని నమ్మేవాళ్లంతా మూర్ఖులు. మీరుగూడా ఎందుకుమూర్ఖులగుతారు.

వృ-ఉ—నేను మూర్ఖుడను. మూఢుడనై మిమ్ములను

యీశాస్త్రమును నిందించినమాట నిజము. ఆవన్నియు తల బెట్టక నన్ను క్షమించి మాయింటికి ఒకసారివచ్చి నన్ను రక్షించండి అనికాళ్ళమీద పడబోగా (అనంతశాస్త్రిగారు లేవదీసి)

అ-అనం—నడువండి వెడుదము.

(ఉభయులు ఉపేంద్రరావుగారింటికి వెళ్ళి కూర్చుందురు)

వృ-ఉ—అయ్యా శాస్త్రిగారు! మాయింట్లో నిన్న రాత్రి రు 3000 ల జవాహరీ పోయిందండి వంటబ్రాహ్మణుడును వడ్లమంగలిని కలిసిచేసినారు. వారిద్దరు రాత్రివద్దనే వున్నారు. ప్రొద్దున లేరు. జవాహరీ లేదు. వూళ్లో ఎక్కడ లేరు. ప్రొద్దున్న మెయిలులో వెళ్ళిపోయినట్టు తోస్తుంది. ఇదియిట్లావుంటగా మాఅబ్బాయికి ప్రాణంమీదకివచ్చినట్టు యిదిగో జెలిగాం వచ్చినది గనుక ప్రస్తుతంలో గ్రహాస్థితి ఎట్లావుండునో, పోయిన ఆస్తివచ్చునో రాదో మాఅబ్బాయికి ఎట్లావుండేది తెలియపఱచగోరెదను. మీకు తగినసత్కారము చేసెదను.

అ-అనం—మీఅబ్బాయికి జాతకమున్నదండీ?

వృ-ఉ—ఆ. ఉన్నది. (అని లోపలికివెళ్లి తెచ్చియిచ్చును.) ఆజాతక మచ్చటవుంచి, ఉపేంద్రరావుగారిని గొన్ని అంకెలడిగి సాంఖ్య శాస్త్రప్రకారం జాతకంవేసి తాత్కాలిక లగ్నంకట్టి ఏమండోయి ఉపేంద్రరావుగారు మీజవాహరీకేమి భయంలేదు. అవియెచ్చటకుబోవు. వాటివిషయంలో నాది పూచీ, స్వల్పకాలంలోనే మీజవహారీ మీకురాగలదు (అని

చెప్పి జాతకంపుచ్చుకొనిచూచి) పరికాశముగా అయ్యా! ఉపేంద్రరావుగారు మీఅబ్బాయి చూడికుమతరావునకు ప్రస్తుతంలో చాలా జబ్బురోజులు. గ్రహస్థితి బాగాలేదు. అయినను మీలోనెవరయినా వెంటనే వెళ్లుటమంచిది. యిచ్చట యింట్లో నింపాదిగానుండేవర్లు మహామృత్యుంజయజపము చేయించండి. నేను వెనుక రహదారీపడవలో కలిసికున్నప్పుడు చెప్పలేదండీ. మీకు కోపం కూడావచ్చినది. చూచినారా? జబ్బుచేసినది. అయితేం లెండి ప్రాణభయం రాదు. మరేమియు భయంలేదు. (అని చెప్పుచుండగా) సాలూరునుంచి యీపు పేంద్రరావుగారి స్నేహితునివద్దనుంచి, వీరినడ్డిమంగలియు వంటబ్రాహ్మణుడును జవాహారీసహితంగా వచ్చినారనిన్ని ఆయనపట్టుకుని జవాహారీ సహా వారిని తనవద్ద వుంచుకొన్నట్టును ఉపేంద్రరావుగారిని తక్షణం బయలుదేరి రావలసినట్టున్ను టెలిగ్రాంవచ్చినది.) అది చదువుకొని సంతోషముఖముతో ఏమండోయి? శాస్త్రిగారు మీరు చెప్పినట్టే జవాహారీ దొరికినట్టు తంతివార్తవచ్చినది. అని వృత్తాంతమంతా జెప్పుచు) ఆహా ఏమిశాస్త్రమండీ. ఎంతచక్కని శాస్త్రమండీ. ఏమిఋజువుగానున్నది. వెరీగుడ్ సైన్సు అనిలోపలికివెళ్ళి రు 116 లు తాంబూలములోపెట్టి అనంతశాస్త్రిర్లుగారి కిచ్చెను.

అ-అనం— మీరు సాలూరువెళ్ళి జవాహారీ తెచ్చుకునే ప్రయత్నం చేయండి. పిల్లవానికికూడ నింపాదిగానుంటుంది. మీరు ఆతుర్దాపడనక్కరలేదు. (అనిచెప్పి వెళ్లుచుండెను.)

వృ-వు—చిత్తం తిరిగి దర్శనమెప్పుడు.

అ-అనం—తమదయ యెప్పుడువస్తే అప్పుడే.

వృ-వు—చిత్తం.

అ-అనం—(శెలవు అని వెళ్ళిపోవును.)

పిమ్మట ఉపేంద్రరావుగారు గుమాస్తాయును ఉపేంద్రరావుగారన్నగారును సాలూరు వెళ్ళి జవాహరీ తెచ్చుకుందురు. ఉపేంద్రరావుగారు కొలంబో వెడదామనుకుంటూవుండగా వారి అబ్బాయికి నింపాదిగావున్నట్టు తిరిగి తంతివార్తవచ్చెను.

(అందరు నిష్క్రమించిరి.)

(ఇదిచతుర్థాంకము)

## పంచమాంకము.

పంచమాంకము—ప్రథమరంగము.

ముస్తాబాదా రైల్వేస్టేషను.

ప్రవేశము—దగుల్బాజీరావుగారు, ప్లీడరు. ఘుంటముక్కుల సోమనాథరావు, వైద్యుడు. అమృతవాక్కుల అనంతశాస్త్రిగారు, గొప్పజ్యోతిష్కుడు.

(వీరుముగ్గురు ముస్తాబాదానుంచి స్వచ్ఛందపురము వెడుచు రైలుకొఱకు ముస్తాబాదాస్టేషనులో గూర్చుందురు.)

దగుల్బాజీరావుగారు—యేమండీ? అవధానులుగారు,

ఇప్పుడుమీ జ్యోతిషం యేమయినా ఋజువు అవుతూందండీ. పోనీ ఆమాట మీకెందుకుగాని మీకు డబ్బుయేమైనా దొర కుచున్నదా? (ఈఅవధానులుగారు యేమియు జవాబుచెప్పక కూర్చుందురు.)

ఘుంటముక్కుల సోమనాధరావు—యేమండో దగుల్బాజీ రావుగారూ? మనలోమనమాట నేచెప్తాను వినండి ఆయ నను అడిగేదేమిటి. యస్ట్రాలజర్సు అండుప్లీడర్సు మేబిటేకెన్ టు కంపేరిజన్ విత్ రిగార్డు టూ దేర్ రెస్పెక్టివ్ ప్రొఫెషన్సు.

ప్లీజ్ డోంట్ టు బి అఫెండెడ్డు. ఇజిట్ నాట్ మైడియర్ ఫ్రెండ్? డోంట్ యూ్ అగ్రీ విత్ మి?

అమృతవాక్కుల అనంతశాస్త్రిగారు—యేమండీ? సోమ నాధరావుగారు? ఈప్లీడరుగారు మమ్ములను యిట్లా ఆక్షేపించు తారుగదా. వీరివృత్తికన్న హీనమైనవృత్తిటండిమాది? ఏమం టారా? చెపుతానువినండి. కేసులు పట్టినది మొదలు ఆఖరు అగువరకు పొరపాటునయినా నిజమాడి యెరుగరుగదాండీ? శుద్ధఘోరకలియగునట్టియు నభూతకల్పన యగునట్టియు యబద్ధ పుసాక్ష్యమింటివద్ద పాఠము చెప్పి యేకదాండి కచేరీలకు తీసు కొనిరావడం. ఇంకఫీజులుచూస్తే ఎందలుకోలదికదాండీ! మొ న్నీమధ్య మావాడు చెప్పినాడులెండీ "పూల్సుమేకు లాయ ర్సురిచ్చి" అనియున్నదట (Fools make lawyers rich) దీనియర్థ ము మీకేతెలుసునుగద్దాండీ!

ఘు-సో—అయ్యా! మీ వాడు ఏమిచదువుకుంటున్నా డండీ?

అ-అ—మా వాడాండీ! యిస్కూలు ఫైనలుక్లాసుటండీ! (School final class) మరియు యిందాకటి తరువాయి చెప్తాను వినండి. వందలుకొలది ఫీజుగదాండి. చూస్తే మళ్ళీ పిల్లికి భిక్షము లేదు సుమండీ. ఇది అంతాయెందుకండీ మామలికిపురం గ్రామంలో సొట్టముక్కుల చప్పిదవడలరావు అని ఒకప్లీడరు న్నాడండీ. ఆయనీమధ్య కూతురు పెళ్ళిచేసినాడండీ.

ఘుసో—వడ్డీవ్యాపారం చేస్తాడాయనా యేమిటండీ!

అ-అ—అవునండి సుమారు ముప్పదివేల రూపాయిల వడ్డీవాపార మున్నది సుమండీ. ఇంతకు చెప్పే దేమిటంటే పెళ్ళి చేసినాడాండీ ఆపెళ్ళి నాలుగురోజులయిన యెవరిని పిలువలేదుటండీ. సరి యిట్లావుంటూంటే ఆపెళ్ళికి వచ్చిన బంధుమిత్రులందరు యేమిరా చప్పిదవడలరావు? నీకొక్క కూతురుగదా! పుత్రసంతానము లేదుగదా! ఇదంతా నిస్వార్జితముగాదుకదా! నీతండ్రి తిమ్మాజీరావుగారు సంపాదించినీకిచ్చి వెడితే వట్టిప్పుడు లేనేలేదుగదా! కూతురు పెళ్ళికయినా పోనీ యితరులనువద్దు ఆమీప్లీడర్లను కొంతమందినైనా ఒకరాత్రిపిలవరా, వెధవ డబ్బుయేమిచేస్తావు పోనీ కొడుకులున్నారేమోఅంటే అదిసున్న గదా! తింటే నీకుపడదుగదా; అని అందరు చీవాట్లుపెడితే ఆమరునాడు రాత్రి పదిమంది ప్లీడరులను పిలిచినాడుటండీ; ఇకపి

లిస్తే జరిగినముచ్చట. ఆరాత్రిటండీ, పప్పులేదుటండీ. రెండో కూర లేదుట. పొన్నగంటికూర పెసరపప్పు వేసినారుటండీ! పాతచింతకాయపచ్చడిటండీ. వంకాయబజ్జీటండీ. చారుట. ఇక పిండివంటకు మారుగా ఆరాత్రి బజారుకువెళ్ళి దేవాంగుల దుకాణంలో సరుకులు చవకలెండి. అక్కడ నూనిమిఠాయి చిన్నవుండలు మూడు అరపంపులు తెచ్చి వడ్డించినారుటండీ. అదేనా మారులేదుటండీ అయిందాండీ! ఇక నేతిజారీపట్టుకొని ఆయనస్వయంగా వడ్డనకొచ్చినాడుటండీ! ఆనేతిజారీ అట్లాచే యించినారో లేక ఆజారీకొమ్ములో యేమయిన పడినదో నాకు తెలియదుకానండి, అది యెంతనేపొంచినా నాలుగు బొట్లుకన్న యెక్కువ పడదుటండీ. అసలు అది నూనికలిపిన మురికినెయ్యి టండీ! నేవిన్నది చెపుతున్నాను సుమండీ. ఇక తండ్రితద్దిన మొస్తుందాండీ రెండు కూరలుకన్న యెన్నడు యెక్కువలే దుటండీ. అదైనా యేమిటో యెరుగుదురా అరటికాయాను పొ ట్లకాయీను అవి చవుకలెండీ ఒకడబ్బుపెడితే రెండు అరటికా యలు ఒకడబ్బుపెడితే ఒకపొట్లకాయాను మొత్తము రెండబ్బుల కూరలండీ. ఇక దక్షిణ మూస్తేకాని కానిటండీ. సరి యిది యిట్లావుంచండి. డభక్కుల ఉళ్ళక్కిశాస్త్రి అని యింకొక ప్లీడరున్నాడు. ఈయన తండ్రిండి పొత్తరులు పట్టి కాలక్షే పము చేస్తూవుండేవాడు. యేలాగో అదృష్టవశముచేత యీ ఉళ్ళక్కిశాస్త్రిగారు యీప్లీడరువృత్తిలో కొచ్చినాడండీ. ఈ

యనకుటండి వారిగుమాస్తా యెంతచెపుతే అంతేటండి. తరు వాత ఈయనకు స్నేహితులు అవనివ్వండి, బంధువులు, కాని య్యండి, కావలసినవారు అవనివ్వండి మర్యాదలేదు మంచి లేదు నరేగదాండి? ఇంకఫీజుచూస్తే వెయ్యిరూపాయలకు దావా కానివ్వండి పదివేలరూపాయిలకు దావాకానివ్వండి మొత్త ముఫీజు రూపాయిపావలాకంటె యెన్నడు యెక్కువలేదుటండీ. ఇది యిట్లావుంచండి ఇందులో ఇంకొకవిశేషము ఈవచ్చిన మొత్తముఫీజులో మూడువంతులు ఆగుమాస్తాదిటండీ. ఈ రూపాయిపావలలోను ఈయనకు వున్నది 0.5.0 అణాలు గదాండీ. తరువాత మునసబువారు కేసుపిలిచేసరికి ఈయన ముందర గుమాస్తాను వేతుకోవాలి, యెందుకుచేతనంటే ఆగుమాస్తా వెనకాలుంటేగాని ఈయన యెందుకు మారడు టండీ. ఇట్లనే అనేకములున్నవండి. ఇదండి వీరివృత్తి. అయితే నిర్మలబుద్ధితో పరికించినయెడల యింత, యుత్తమమైనవృత్తి మరిఒకటి యేదిలేదుసుమండి. అటువంటి ప్లీడర్లున్నారు. కాని యిప్పుడు మహానుభావులు కొంతమంది బయలుదేరి పాడీచేస్తూ న్నారు. అయినప్పటికిన్ని ప్రస్తుతంలోగూడా యనేకమం దుత్తము లీవృత్తిలోవుండి గౌరవముగా ప్రవర్తించి ప్రతిష్ట తెచ్చుకొని వృత్తియొక్క గౌరవము కాపాడుచు పరోపకారు లై దేశమున కుపకారముజేయుచున్నారు. బీదలను అనేకవి ములుగ రక్షించి పనిజేయుచున్నారు. కనుక ఒక్కొక్కరివల్ల

స్తోత్రనీయము, ఒక్కొక్కరివల్ల నిందాస్పదము. కనుక యిట్లావుం దండి. తెలిసిందాండి. అయితే నేను యిదంతా సాముదాయకం గా (General) చెపుతున్నానునుమండి. వీరిలోనే మరికొంతమంది ప్లీడర్లున్నారు. వారికి నిజంగా అబద్ధమన్నది పనికిరాదు. నిజ మయిన కేసయితేనే పనిచేస్తారు. కాకపోతే మావల్ల కాదు అని చెప్పివేస్తారు. అభద్ధపుసాక్ష్యం పనికిరాదు. నిజంగా కేసు తెలి సినవారలే సాక్షులుగా వుండవలెను. ఫీజులు బహు న్యాయం గా పుచ్చుకుంటారు. సాధ్యమయినంతమట్టుకు ఉభయపార్టీలను బిలిపించి రాజీనామాకు ప్రయత్నంచేస్తారు. అదంతాఎందుకు! వ్యాజ్యమువేస్తే చాలా ఖర్చులు అవుతవి వ్యాజ్యమువద్దు అని చెపుతారు. ఇంకాసలహాలుజెప్పి అనేకఉపకారములు చేస్తారు. పేచీలుంటే అవి లేకుండగనే వుపాయంగావదిలే సలహా చెపు తారు. గనుక ప్లీడర్లులో నేనాఅందర్ని ఒకరీతిగాకట్టుటకు వీలు లేదు, అటూవున్నారు. ఇటూవున్నారు. కావున వీరిలోనే గొం దరు బహున్యాయముతోనున్ను, సత్యముతోనున్ను ఉన్నది వున్నట్టుగా నిజమయిన కేసులులో పనిచేస్తారు. వీరిలో కొంత మంది మంచివారును న్యాయముకలవారు గలరు. అందరి విష యంలోను నేను చెప్పటలేదు. కొంతమంది ఉచితముగా కూడా పనిచేసి బీదల కుపకారముచేస్తారు. దానధర్మములు చేస్తారు. వీరిలోనే మంచి బుద్ధిమంతులు గలరు. అనేక గొప్పపనులుజేసి పేరుప్రతిష్టలొంది పరోపకారపారీణులుగనున్నారు. ఉత్తమో

త్తములున్నారు. తెలివిగలవారున్నారు. న్యాయాన్యాయ వివక్ష తగలవారున్నారు. ఇదిగాక అపకారముజేయుట కసలు యిష్ట పడనివారున్నారు. కేసు ఓడీపోతే నిష్కారణముగ ఖర్చులు దండగ అవుతవేమో అని ఆలోచిస్తారు. వ్యాజ్యములో యిళ్ళు భూములు, ఆస్తులు వగైరాలు నిలబెట్టి వుపకారములు చేసే వారున్నారు. వీరిలో గొందరు పాటువడి దేశ శేవచేయుచు న్నారు. అందుచేత చెప్పవలసి వచ్చినప్పుడు మనము సవబు గానే మాట్లాడుకోవాలికాని కేవలము స్తోత్రము పనికిరాదు. కేవలము నింద పనికిరాదు. ఉన్నది ఉన్నట్టుగా జెప్పకోవాలి. ఇంకా చెప్పుతాను వినండి. కొందరు పైనవచ్చే స్వల్పఫీజుకు ఆశపడి ఆస్తులు జప్తులుచేయించి ఖైదువారంట్లు జారీచేయించి చిక్కులు పెడతారుగదాండి. అయితే వృధా శ్రమయేగాని యిప్పటిరోజులలో ఖయిదువారంట్లుమీాద ఎవరు దొరుకుట లేదుటండీ. ‘‘మేముపట్టి అప్పగిస్తాము వారంటు జారీచేయి స్తాము మునసబుగారికి నేనంటేచాలా యిష్టము” అని ప్రగ ల్భములు బల్కి ఫీజులుపుచ్చుకుని చివరకు ఉళ్ళక్కి చేస్తారు. గనుక ఈప్లీడరుగూడా మమ్ములను ఆక్షేపించడమేనాండి. ఇంత మేమాండి, యవరైనా వారంతటవారు మాయొద్దకువచ్చి మమ్ములను అడిగినప్పుడుగదాండి. పిలిపించి డబ్బులాగుటకు మావద్ద ఏజంట్లు వుండరుగదాండి ఒకరివద్ద ఒకవ్యాజ్యము దాఖలు కాగానే ఆవ్యాజ్యములో ఎదరపార్టీలపేర్లు కనుగొని

వారికి ప్రత్యుత్తరములు వ్రాయడం లేదుగదాండి. వేసవికాలపు శలవులలోను క్రిస్టమస్ శలవులలోను పార్టీల గ్రామములు వెళ్ళిగాని గుమాస్తాలనుబంపిగాని పరిశోధించబడుట మాకు చేతగాదుగదాండి. మాకు గుమాస్తాలు లేరుగదాండి. కనుక ఎవరైనా వచ్చి జాతకమిచ్చి యోగావయోగములు అడిగినయెడల వారి జాతకములు చూచి వాటిలో వున్నవి చెప్పెదము. లగ్నము సరియయినదైనప్పుడు మేము జెప్పినవి సరిగ ఋజువిచ్చునులేనియెడల లేదు. అంతేగాని లేనిపోనివి క్రొత్తగా కల్పనజేసి దుర్మార్గులను ప్రోత్సాహపరచి కొంపలు తీయడం మాకు చేతగాదుకదాండి.

ఘు-పో—మా బాగా చెప్పినారండి. యక్సలెంట్.

ద—వాట్! నాంసెన్సు; యస్ట్రాలజర్సు అండ్ డాక్టర్సు టేక్ మనీ ఫ్రొంది పీపిల్ కీపింగ్ దెం అండర్ బేడ్ నోషన్సు.
(What! nonsense; Astrologers and doctors take money from the people keeping them under bad notions.)

ఘు-పో—నాంసెన్సు! యు, ఫేబ్రికేటుథింగ్సు, మిస్ రిప్రెజంట్ ఫేక్ట్సు అండ్ ఫ్రేమ్ ఫాల్సు కేసెస్. యస్ట్రాలజర్సు అండ్ డాక్టర్సు ఆర్గిఫ్టెడ్పెర్సన్సు; యుమస్టు నో. (Nonsense! you fabricate things, misrepresent facts, and frame false cases; Astrolegers and doctors are gifted persons. You must know.)

ద—వాట్యుసెడ్ యిజ్ మీనింగ్లెస్ అండ్ ఇన్సల్టింగ్. థింక్ ట్వైస్ బిఫోర్యూ స్పీక్. డోంట్ లెట్ లూజ్ యువ

ట్రంగ్. (What you said is meaningless and insulting. Think twice before you speak. Don't let loose your tongue.)

ఘు-సో—వాట్ టంగ్. ఐ రిప్రిజంటెడ్ ది ఫేక్ట్సు. వున్న మాటంటే ఉడుకుఎక్కువట. (What tongue! I represented the facts.

అ-అ—అయ్యా దగుల్బాజీరావుగారు! వైద్యము జ్యోతిషము అవసరములేనివా రుండరండి. మీకుగూడ కొద్దికాలంలోనే అవసరం వస్తుంది చూడండి.

ఘు-సో—ఐ సె మిస్టర్ దగుల్బాజీ! ది వరల్డిట్సెల్ఫు కనాటెగ్జిస్టు విదౌటేన్ ఎస్ట్రాలజర్ అండ్ యే డాక్టర్. (I say mister Dagulbaji. The world itself cannot exist with out an Astrologer and a doctor.

(యిట్లా జరుగుచుండగా దగుల్బాజీరావుగా రింటివద్దనుంచి వారి భంట్రోతు గుండెలు గుద్దుకుంటూ సైకిలుమీద దగుల్బాజీరావుగారిభార్య కకస్మాత్తుగ పక్షవాతమువచ్చి వళ్లు తెలియకుండా పడియున్నట్టు వచ్చి చెప్పును.)

ద—(ఆదుర్దాతోను, తొందరతోను) లేచి నిలుచుని ఏమండీ అనంతశాస్త్రిగారు! నేనిదివరలో నన్నవాటి కన్నిటికి నన్ను క్షమించి నాయందు దయవుంచి ప్రస్తుతపుస్థితి ఎట్లావుండేది దయచేసి చెప్పగోరెదను. మీరింతకు పూర్వమే "కొద్దికాలంలోనే అవసరంవస్తుందని" చెప్పినారు. ఆలాగేవచ్చినది. మీవాక్కులు తప్పకుండా అమృతవాక్కులే. గనుక నన్ను

క్షమించి నాయందు పూర్ణదయవుంచి ఒకసారి నాతోగూడా దయచేయమని ప్రార్థించుచున్నాడను. నాభార్యకు ఎట్లావుంౕడేది జెప్పగోరెదను. మీరు నింపాదిగా నుంటుందంటే తప్పకుండా వుండడమే. (సోమనాథరావుగారికేసి తిరిగి) ఏమండోయి సోమనాథరావుగారు!

యుప్లీజ్ ఎక్స్క్యూజ్ మి ఫర్ మై యిన్‌జూడిషన్ టాక్; యుప్లీజ్ కం అండ్ సి మైవైఫ్ అండ్ ప్లీజ్ కీప్ హెర్ అండర్యువర్ కైండ్ అండ్ వేల్యుబిల్ ట్రీట్‌మెంట్. ఐయాం ప్రిపేర్డు టు పె వాటెవ్వర్ యు డిమేండ్. (You please excuse me for my injudicious talk. You please come, see my wife and keep her under your kind and valuable treatment. Iam prepared to pay whatever you demand.

ఘు-సో—అయ్యా! అనంతశాస్త్రిగారు! వారు అట్లా అంటూవున్నప్పుడు మనము వెళ్ళకపోతే మర్యాదగా వుండదండి. గనుక మనము వెళ్ళక తప్పదండి.

అ-అ—చిత్తం ఆలాగే కానియ్యండి. (అందరు బయలుదేరి దగుల్బాజీరావుగారింటికి వెళ్ళుదురు)

ద—అయ్యా సోమనాథరావుగారు! చేయిచూడండి (సోమనాథరావుగారు చేయిచూచుచుండగా దగుల్బాజీరావుగారు లోపలికివెళ్ళి జాతకం పట్టుకొనివచ్చి అనంతశాస్త్రిగారికిచ్చిచూడమనును.)

ఘు-సో—మరేమియు తొందరలేదు. వాతముజేసినది. మాడిస్పెన్సరీలోనికి బంపండి మందిస్తారు.

అ-అ—(జాతకం చేతిలోవుంచుకుని చూస్తూ అయ్యా? దగుల్బాజీరావుగారు! తమకండి ప్రస్తుతంలో చాలా జబ్బురోజులు. ఎందుచేతనంటారా! తమది మకరలగ్నం. వర్తమానం శనిమహాదశలో శుక్రభుక్తి జరుగుచున్నది. అనగా కుటుంబ స్థానాధిపతిదశలో కళత్రకారకుని అంతరము. వీరుభయులకు షష్టాష్టకము పట్టినది. పైగా అంగారకుడు చూచుచున్నాడు. ఇంకా రెండుమాసములున్నది యీభుక్తి. అయితే ప్రాణాపాయంరాదు. కాని ఒకపనిమాత్రంచేయించండి. ఈరెండుమాసములు రుద్రజపంచేయించి ఆఖర్న అన్నశాంతి చేయించండి.

ఘు-సో—మరేమియు భయంలేదండి సాదిపూచీ. ఒక నెలరోజులకు నింపాదిగా నుండగలదండి.

అ-అ—అవునండి. సరిగానే వున్నది. ఒక్కమాసరరోజులుగడచేసరికి జాడ్యంమళ్ళీ ఆరోగ్యమేర్పడగలదు. రెండుమాసములు పూర్తిగా వెళ్ళేసరికి పూర్తిగా ఆరోగ్యస్థితి గలుగునండి. (యిట్లావుంటూవుండగా సోమనాథరావుగారి డిస్పెన్సరీలోనుంచి దగుల్బాజీరావుగారి నౌకరు మందు పట్టుకునిరాగా దానిని సోమనాథరావుగారు పుచ్చుకొని ఆమెకిచ్చును.)

ద—మీరుభయులు నాపాలిటి భగవంతులు. (అని చెప్పిలోపలికి వెళ్ళి చెరియొక నూరురూపాయిలు పట్టుకునివచ్చి యివ్వబోగా యిద్దరు నిరాకరించుదురు.)

అ-అ—పూర్తిగా నింపాది స్తేనేగాని నే నంగీకరించనండి.

ఘు-సో—బాగా ఆరోగ్యం కలిగితేనేగాని నేనుపుచ్చుకొననండి.

ద—చిత్తం. నేనప్పుడుభయులను సంతోషపెట్టెదను.

ఘు-సో—చిత్తం నాకుశలవు. వచ్చిచూస్తూవుంటాను. మందుకు రెండుపూట్ల మాడిస్పెన్సరిలోకిబంపి తెప్పించుకొనండి. ఈ మెకు గాలి తగులనివ్వక లోపల పఱుండబెట్టండి (అని చెప్పి వెళ్ళిపోవుచు) శాస్త్రిగారు! శలవండి. (అని వెళ్లును.)

అ-అ—చిత్తం. (అనిలేచి నిలుచుండును) నాకు కూడాశలవండి. దగుల్బాజీరావుగారు?

ద-తిరిగిదర్శన మెప్పుడు?

అ-అ—తిరిగి ఒకమాసం రోజులలో వస్తాను.

ద—చిత్తం తప్పక నాయందు దయయుంచి రాగోరెదను.

అ-అ—చిత్తం (అనివెళ్లును).

ద్వితీయరంగము

(బాతాఖానీ భగవంతరావుగారిదొడ్డి సావిడివసారాలో చీట్లపేకాడుకునేగది.)

(ప్రవేశము—బాతాఖాని భగవంతరావు, పొగపిడతల నిప్పచ్చు, అవసరాల ఆనందరాయుడు.

—(~~ఆనందరాయుడు,~~ భగవంతరావు, గదులో కూర్చునివుండగా పొగపిడతల నిప్పచ్చ ప్రవేసించును.)

భా-భ—ఏమిరోయి! పిడతా! యీమధ్య ఎక్కడను కనుపించడం మానివేసినావు.

పొ-ని—ఏమిచెప్పనురా! నేనీమధ్య యేలూరువెళ్ళి లావెండర్సు, సెంట్సు, హెయిరాయిల్సు, హెయిర్ డిస్ట్రొయర్సు, ముఖము మెరుగడబ్బాలు, గుండుసూదులు, సిగరెట్లుపెట్లు కారపకిళ్ళీసామానులు జిన్‌టన్‌పిల్సు పట్టుకునివచ్చినానురా?

భా-భ—ఒరేయి! గనేరియాకును స్పిఫ్లిస్కును కూడా పట్టుకుని రాకపోయినావురా! నీస్వంతానికి పనికివచ్చును.

పొ-ని—ఏడిశావు. పోదూ; వెధవకబుర్లూ నువ్వూను.

భా-భ—ఒరే! అవునుకాని, నేనీవాళ విన్నాను. నువ్వూను గులాంఖాను జాయింటుట కాదురా?

పొ-ని—అబ్బె లేదురా? కాని నేనీమధ్య చిప్పెయ్యి ఫీకాటలుహాలో ప్రవేశించినాను. నెలకి అయిదురూపాయిలు యిస్తాడు. అదిచాలక వర్తకం పెట్టినాను.

భా-భ—ఏడిశావు. ఎక్కడో ఏదో నౌకరీ ఏడవాలి కాని యీలా వెండర్సు, సెంట్సు గాడిదిగుడ్డు, నీపిండాకుడు, యీవన్నీ ఎందుకురా? నీకు. మొన్నీమధ్య మీాముసలిముండ మాాఅమ్మవద్ద ఏమో ఏడిసిందట. నువ్వీమధ్య ఏదో భూమి అమ్మి తగలేసి ముండ కెట్టినావుట కాదురా? ఆరటిపళ్ళవాం

డప్రకు, సోడా బాటిల్సుకు, కారపు కిళ్ళీలకు, మంగలాడికి వైద్యానికొంతా, సిగరెట్లకు తగలవేసినావుట. ఒరే నీకంటే కోపంవస్తుందికాని యింతచేతకాని వెధవ్వేమిటిరా? (ఇంతలో అవసరాల ఆనందరాయుడువచ్చును.)

అ-ఆ—ఏమిరోయి నిప్పచ్చా? యీమధ్యయేదో వ్రతకంపెట్టేవుట.

భా-భ—వాడిశ్రాద్ధంపెట్టేడు.

అ-ఆ—అదేమిటోయి అట్లాఅంటూన్నావు.

భా-భ—ఏమిచెప్పనురా? వీడింత వెధవేమిటిరా? ఏమిటంటే ఒరే! వీడికీమధ్య ఒక బాపతు సొమ్ము వచ్చిందిరా. అదెట్టి వ్రతకం చేస్తానన్నాడు. నేను వద్దానుసుమా! చవలపీనుగు నేనుచెప్పినది వినకుండా ఎవరో అనంతశాస్త్రిట. ఏదో జాతకం పట్టుకునివచ్చి ఆశాస్త్రివద్దకువెళ్ళి చూపించివచ్చినాడు. పాపము ఆశాస్త్రిగారయినా యిప్పుడు మంచిరోజులుకావు. నీకంతాపోతుంది వ్రతకం చేయవద్దని చెప్పినాడుట. చివరకు ఎవరుచెప్పినది వినక పెట్టేడు? అంతా క్షవరమైనది. ఇప్పుడు భుక్తికయినా ఏమీలేదు.

అ-ఆ—ఒరేయి? అనంతశాస్త్రి చాలా తెలిసినవాడు. నువ్వు అల్లాఅంటే నేను ఒప్పుకోను. అనేకమంది రిఫార్మర్సుని కన్విన్స్ (Convince) చేసినాడు. మొన్నీమధ్య ఉపేంద్రరావుగారి విషయంలో అంతావిన్నావా?

భా-భ—ఆ. ఏమి అద్భుతంగా చెప్పినాడురా!

అ-ఆ—మరి ఇంకేమి?

పో-ని—పోనిద్దురూ; నాకీమధ్య, ఒకవిషయంలో కొంచెం మునిగిందిరా దానికేమయినా సలహా చెప్పుదురు.

భా-భ—అదేమిటో యీ చెప్పేవుగావు.

పో-ని—దానవంతుల ధర్మమూర్తిగారుకి స్త్రీకి కావలసి ఒకబంగారపువస్తువిచ్చి తాకట్టుమీద కొంతసొమ్ము తెమ్మన్నారు. ఆలాగే అని తెచ్చియిచ్చినాను. తిరిగి నిన్న ఆయన, నే తెచ్చిన సొమ్ము, వడ్డీ, యిచ్చి ఆవస్తువ తెమ్మన్నారు. సరేఅని వెళ్ళి ఆవస్తువయిమ్మని మారువాళ్ళిని అడిగేసరికి ఇచ్చినాడురా! ఆవస్తువ చూచేసరికి అది నేపెట్టిన వస్తువులా అగుపడలేదు. సరేఅని మళ్లీవచ్చి ఆధర్మమూర్తిగారితో చెప్పేసరికి, ఓరి చవట ముండాకొడకా అనితిట్టి ముక్కుసలిపేసినాడురా? పయిగానెత్తి మీద ఠంగున మొట్టినాడురా? ఒరే ఆవాళనే జ్వరం కూడా చేయించుకున్నానురా. (అని నెత్తిమీద బొప్పిజూపెట్టును.) పైగాచార్జీయిస్తాను అంటాడు! ఏమిచెప్పను ఒరే!

భా-భ—ఒరేయి ఆనందరాయుడు! ఆవస్తువుపట్టుకొని వెళ్ళి యేమిచేసినాడురా? కాని మాబాగా చేసినాడురా. నేనైతే చెప్పదెబ్బలుకొట్టి అవతలకు పొమ్మందును. గనుక అతను ఈవిషయంలో చాలాఉత్తముడే అని చెప్పవచ్చును.

అ-ఆ—సరి యేఋుగవురా! వీడికి ఒక పెద్దగొడవ ఉన్నది.

భా-భ—అదేమిటోయి యెప్పుడువిన లేదు.

అ-ఆ—పీడికోముండరా!

భా-భ—ఇంకేమి అలా చెప్పు; సరే యీావస్తువుపట్టుకొని వెళ్ళి ఆగోదాంలో పడవేసినాడు.

పో-ని—పోనిద్దురూ! అయిందేమిటో అయింది నన్నేమి చెయ్యమంటారో సలహా చెప్పండి.

అ-ఆ—ఒరే భగవంతరావు ? దగుల్బాజీరావుకి వకాల్తనామా యిప్పిస్తే.

భా-భ— అబ్బె వద్దురా! వాడిగుమాస్తా వట్టి దళారీగాడు.

అ-ఆ—పోనీ పొట్టముక్కలాయునికిస్తే.

భా-భ—అబ్బేవద్దురా, ఏమంటావా; అతను రోజూ ఒంటిగంటకు కచేరీకివస్తాడు. వచ్చినా ఆబారురూములో కూర్చుని న్యూస్ పేపరు చదువుకుంటాడు. నాలుగు గంటలవడముతోనే క్లబ్బుపేరుచెప్పి వెళ్ళిపోతాడు. పనిలేదు. పాటలేదు.

అ-ఆ—ఒరే పోనీ!డభక్కుల ఉళ్ళక్కిశాస్త్రికిస్తే.

భా-భ—వద్దురా ఆయన కపలు కేసే అండర్ స్టాండు కాదు.

అ-ఆ—మరేమియు భయంలేదురా; ఛార్జికొట్టివేస్తారు ఋజువయి ఏడుస్తుందాఏమిటి ?

పో-ని—అవునుట. నిన్న డభక్కుల ఉళ్ళక్కిశాస్త్రి

గారును పొట్టముక్కులాయనకూడా ఆలాగే చెప్పినారు. పైగా అనంతశాస్త్రిగారిని కూడా అడిగినాను, ఆయ నయేమియుభయం లేదు చార్జీ యివ్వరు. ఒకవేళయిచ్చినా కొట్టివేస్తారు. అని పరీక్ష చూచి చెప్పినారు.

భా-భ—ఏడిశావు నిర్భాగ్యుడా! (యిట్లా వుంటూండగా ధర్మమూర్తిగారి గుమాస్తా అచ్చటకు ఏదోపనిమీదవచ్చి సందర్భములో చార్జీ యివ్వలేదని చెప్పగా నిప్పచ్చ ఘుమ్మన లేచి ఎచ్చటికోపోవును.)

అ-ఆ—ఒరేయి! ఏడిరా; వీడు; యీపిడత.

భా-భ—ఎక్కడికి పోయినాడో ఒరే?

అ-ఆ—ఎక్కడికి పోతాడురా ఆగోదాంకేసి పోతాడు.

అ-ఆ—అవును ఒరే ఆనంతోషంకొద్దీ పోయినాడు. దానితోవెళ్ళి ఛార్జీయివ్వలేదని చెప్పి ఏవోడభక్కులు కోస్తాడు.

భా-భ—అవును అంతేరా.

(పిమ్మట అందరు వారివారిస్వంతపనులమీద వెడలిరి).

## తృతీయరంగము.

(దగుల్బాజీరావుగారి గృహము)

పరివేశము:—(ఘుంటముక్కుల సోమనాధరావుగారు అమృతవాక్కుల అనంతశాస్త్రిగారు.)

ద—అయ్యా శాస్త్రిగారు? దయచేయండి నమస్కారము.

అ.అ—శుభమస్తు. మీవాండ్రకు బాగా నింపాదిగా వుందాండి?

ద—చిత్తం. తమరు చెప్పినరీతిగానే సరిగా నెలరోజులు వెళ్ళేసరికి జాడ్యంమళ్లి ఇపుడు బాగా ఆరోగ్యస్థితిలోవున్నది.

(ఘు-సోమనాధరావుగారు ప్రవేశించుదురు)

ద—రండి సోమనాధరావుగారు.

ఘు-సో—ఓహో శాస్త్రుల్గారే. ఎప్పుడువచ్చినారు.

అ-అ—నేనాండి యిప్పుడే ఒకఅరఘుడియ అయినది.

ఘు-సో—మీవాళ్ళు బాగా కులాసాగా తిరుగుచున్నారా?

ద—చిత్తం. తమహస్త విశేషముచేతను శ్రీఅనంత శాస్త్రిగారి వాక్సుద్ధి చేతను బాగా నింపాదిగా నున్నది. (అనిచెప్పి వారిద్దర్ని ఆపూట భోజనమునకు వుండమనిజెప్ప, వారు సరేలనినపిమ్మట లోపలికివెళ్ళి భార్యనిపిలిచి) ఒసే ఆవిడేదే తలవెంట్రుకలావిడ.

భార్య—ఎవరు? దద్దమ్మగారా?

ద—అవును. ఆవిడే.

భార్య—అబ్బా! అట్లా అనకండి. ఆవిడకు కోపం వస్తుంది. నిన్న పెద్దాడు అట్లా అనేటప్పటికి నానామాటలు దులిపింది.

ద—ఏడిసింది. ముండకు రూపాయి పళ్ళువచ్చినవి. తల వెంట్రుక లేమిటి? నాగవిల్లి కాకుండా మొగుడుపోయినాడు. అంత్యకోపమెందుకు. రోగిష్టి పీనుగకు చెముటిముండ!

భార్య—మీకేం. ఆవిడ అసలే ముక్కోపంముండ. లేచిపోయినా ఎవరుచేస్తారు యీ ఛాకరీ అంతాను. పోనీసామాన్యపుకొంపగనకనా. ఒచ్చేవారు. వెళ్ళేవారు. నేను చెయ్య లేనుసుమండీ.

ద—పోనీలే నేవండుకుతింటాను.

భా—నాకుకూడా వండిపెట్టండి.

ద—సరేఢాని. ఏది? ఆవిడ?

భార్య—ఆవిడా? నీళ్ళకెళ్ళినది.

ద—సరేవచ్చినతరువాత ముప్పొంకాయ కూరొండమను. పప్పొండి మిరియాలచారు కాచమను. బంగాళాదుంపలువేయించమను. కొబ్బరికాయ పెరుగపచ్చడి చేయమను. పొజ్జ్యభక్ష్యములు చేసి, పులిహోరచేసి బదరిఫేణీలు చేయమను. కొత్తావకాయ వడ్డించమను. కుళంబుకూడా కాచమను. మేడ మీద పడమటివసారాలో అంటుమామిడిపళ్లున్నాయి; పట్టుక వచ్చివడ్డించు; నీవుపట్టుచీరకట్టుకుని వడ్డనకురా (అనిచెప్పి వెడుమతిరిగి వెనుకకువచ్చి) ఒనే పెరుగున్నదా?

భార్య—ఆఁ లేకేమి. తోడెట్టిన పెరుగున్నది. ఇంట్లోఅన్నియు వున్నవి కాని యాలకగింజలు నెయ్యిమాత్రం తెప్పించండి.

ద—సరే పెద్దాడితో చెప్పి తెప్పిస్తాడు. (పెద్దాడుఅనగా పెద్దకొడుకు) వీరందరు భోజనంచేసి మేడమీద తాంబూలంవేసుకుంటూ కూర్చుండగా)

అ-అ—అయ్యా దగుల్బాజీరావుగారు! మీరిదివిన్నారా?

ద—ఏమిటది?

వినండి. కొన్ని దినముల క్రిందట లండనుమహానగరమునందు నిద్దరు పురుషు లన్యోన్యమైత్రి గావించుతరి నొక వింతజరిగెను. అదియే మనవారుభయులు నొకనాటి సాయంకాల సమయంబున సంతోషంబుగ మాట్లాడుకొనుచుండ నాసమీపమున నే జరుగుచున్న నొకసభకు రమ్మనమని యొకడు యొక్కపత్రమును దెచ్చియిచ్చెను. పిమ్మట వారిరువురు నాసభకు వెడలిరి. తరువాత యాసభలో వారి చిరకాల ప్రాణమిత్రు డొకడు గాన్పించెను. పిమ్మట ఆ వెడలినవారిలో నొకరు వానినిట్లు అడిగెను. ‘‘ప్రియమిత్రుడా? నీవు యీమధ్యతిరిగి జ్యోతిషంలో చాలాకృషి చేసినావుట. నాజాతకము ఒకసారి చూడుము. (అని జేబులోవున్న డైరీలో జాతకము) జూపించును. పిమ్మట నాస్నేహితుడా జాతకమునకు విదశసూక్ష్మదశలుగట్టి నేటిమొదలు తొమ్మిది లేక పదిదినములలో నొకపెద్ద విపత్తు రానయియున్నది యనిచెప్పెను. పిమ్మట వారిలో నొకరి నొకరిని విడిపోయిరి. తరువాత నాజాతకుడొకనాడు బజారునకు వెళ్ళగా త్రోవలోనొక మోటారుబండి ఎదురుగావచ్చి తప్పించుకొనుటకు

వీలులేక తనశరీరమునకు దగులుకుని గ్రిందబడ సతనికి నొక చెయ్యివిరిగి మూలబడెను. కనుక జ్యోతిషమును నమ్మి జాతక మునుంచుకుని దానివలన భూతభవిష్యద్వర్తమానములను దెలిసికొనినయెడల రాగల యాపదలను సాధ్యమయినంతవఱకు దప్పించుకొనవచ్చునుగదా; గనుక జాతకములు లేనివారును జ్యోతిషమునునమ్మి దానివలన ఫలము ననుభవించనివారును మహారణ్యమధ్యంబున గాఢాంధకారంబున నుండువారిని బోల్చబడుదురని మనమందరము దెలిసికొనదగినదయి యున్నది.

ద—అవునండి. కొంతమంది తెలియక నీశాస్త్రమును నిందిస్తారుగాని; మిష్టర్ సోమనాధరావు! హియర్. దిసీజ్ది ఓన్లీ సైన్సు దట్ కన్ స్టేండ్ టు టెస్టు. (Mister. Somanadharow! hear; this is the only science that can stand to test.

ఘు-సో—యస్; యస్; (Yes; yes.) ఐ నో యిట్ ప్రాక్టికల్లీ. (I know it practically)

ద—ఒరే అబ్బాయీ బడ్డూరావూ!

బ—ఎందుకు నాన్నా?

ద—యిల్లారా.

బ—(తనలో) ఒక్కమాటయినాపడుక్కోనియ్యవుగదా; యిప్పుడే చల్దియన్నము తిన్నాను. మెలుకువగావుంటే చదువుకో బళ్లోకెళ్లు అంటావు. పడుకుంటే పిలుస్తావు. (అని విసుక్కుంటూవచ్చును.)

ద—ఇందాకా మీఅమ్మచేతికి రూపాయిలు బట్టలుఇచ్చి నాను అడిగి యిల్లాపట్టుకునిరా.

(బడ్డూరావు తీసుకువచ్చియిచ్చును)

ద—మూడువందలరూపాయిలున్ను ఒకదక్షిణాదంచు కెండువాయున్ను సోమనాథరావుగార్కిని రెండువందల రూపాయిలుఒకపట్టుశాలువయున్ను అనంతశాస్త్రిగారికినియిచ్చి నమస్కారము చేయును.

అ-అ—శతాయురస్తు. సుపుత్రావాప్తిరస్తు. శుభమస్తు. ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధిరస్తు సర్వకార్యే దిగ్విజయమస్తు. మనోవాంఛాఫలసిద్ధిరస్తు.

(పిమ్మట వీరందరు సంతోషమానసంబులతో వారివారి యిండ్లకు జనిరి.)

సంపూర్ణము.



Sree Savitri Press, Cocanada.

## ఈ దిగువ గ్రంథములు వెలకు దొరకును.

### జాతకఫలమణిమంజరి—ప్రథమగుచ్ఛము.

ఇది ప్రశ్నోత్తరరూపకముగనుండెను. 158 ప్రశ్నలు త్తరములుగలవు. నూతనపద్ధతిని జ్యోతిశ్శాస్త్రమునందుగల ననేక గ్రంథములయొక్క సారమై యున్నది. బాలురకత్యంతోపయుక్తముగ నుండెను. గురుసహాయముగాని తదితరులసహాయముగాని యవసరములేకుండగనే జాతకభాగము నవలీల నేర్చుకొనగలందుల కేర్పడినది. పండితులకుగూడ విశేషసహకారి యగును. దీనివెల తెలుగుప్రతి పోస్టేజిసహా రు 1-6-0. ఇంగ్లీషుప్రతి రు 1-0-0.

### ద్వితీయగుచ్ఛము.

ఇది ద్వాదశభావములను గురించి దెల్పును. ధనయోగములు, దరిద్రయోగములు, రాజయోగములు, దుర్యోగములు, సంతానవిషయములు, కళత్రభావమును గురించియు, మరియు ననేక జాతకరహస్యములను దెలియజేయును ప్రశ్నోత్తరరూపకముగ నుండెను. సుమారు 160 ప్రశ్నోత్తరములుండెను. ఉదాహరణములుగలవు. జ్యోతిషామూల్యగ్రంథంబులయొక్క సారమయి యున్నది. తెలుగుప్రతి, ఇంగ్లీషుప్రతి అచ్చులోనున్నవి.

### తృతీయగుచ్ఛము.

ఇది ద్వాదశభావములమీద జాతకములుదాహరణములుగ జూపించుచు యోగావయోగములెట్లెట్లుబట్టినవో సహేతువులను గురించియు, నాయుర్భావమును గురించి విరళముగాను వ్రాయబడినది. మరియు నిందు తద్గ్రంథకర్తల యనుభవమును దెలుపు ననేకజ్యోతిషవేదాంతరహస్యంబులును చిరకాలాముద్రిత ప్రాచీనజాతకగ్రంథరాజంబులయొక్క సారమును దెల్పును. ఇదియు నచ్చులోనున్నది.

### అనుభూతజాతకతరంగిణి—ప్రథమగుచ్ఛము.

(అచ్చులోనున్నది. త్వరలో వెలువడగలదు.)

ఇందు శ్రీ ఆదిశంకరాచార్యులు, శ్రీరాములవారు, అప్పయదీక్షితులు, రామానుజులవారు, సప్తమ యెడ్వర్డు చక్రవర్తి, రాణీ విక్టోరియా చక్రి

వర్తిని, నెపోలియను బోనాపార్టు, గతించిన జపాను చక్రవర్తి మున్నగు గొప్పవారియొక్క జాతకములు ఉదాహరణములుగ గైకొని హేతువులతో శ్లోకరూపేణ వారివారిజాతకములు చక్కగ విమర్శింపబడినవి.

## జాతకసారావళి—ప్రథమగుచ్ఛము.

ఇందు అనేక బాలారిష్టములు, బాలారిష్టభంగములు, సుయోగములు, దుర్యోగములు, ధనయోగము, నిర్ధనయోగము, గ్రహములు మిశ్రమముగా నుండి ఏయేగ్రహము ఏయేగ్రహముతో గలిసికొని ఎచ్చటెచ్చటనుండిన యేమిఫలమిచ్చునో తెలుగుశ్లోకరూపేణ అర్థతాత్పర్యసహితంగా నున్నది. సుమారు 200 పేజీలుగలది. స్వల్పకాలములో వెలువడును. ఎన్నడు వినికని యుండని జాతకరహస్యంబు లిందుపొందుపఱచియుండెను.

## జ్యోతిర్వినోదిని.

ఇది యొక్క చక్కని ప్రహసనము. నూతనముగ రచింపబడినది. చదివిన నవ్వుపుట్టించి వినోదమును గలుగజేయును. ఈజ్యోతిశ్శాస్త్రమపూర్వశాస్త్రమనియు పూర్ణనమ్మకముంచదగినదనియు, ప్రపంచమందు, పూర్వమందును ప్రస్తుతంబును జరుగుజ్యోతిషాభివృద్ధినుగురించియు ఎప్పుడెవరెవరు దీనిని వృద్ధిజేసినదియు నీశాస్త్రపఠనమువలన గలుగులాభములు గురించియు. ఏదేశములలో నెంతమంది జ్యోతిష్కులుగనుండి దీనిని యభివృద్ధిజేసినదియు దెలుపును. వెల రు 0-12-0.

## జ్యోతిశ్శాస్త్రమునందుగల జాతకభాగమును నెందుకునమ్మవలెను.

ఇది యొకచక్కని చిన్నపుస్తకము. నూతనముగ రచింపబడినది. చూచి చదివిన సంతోషమగును. ఆకాశమునందుండు గ్రహనక్షత్రాదులకును భూమియందు నివసించు మనుష్యులకునుగల సంబంధమును దెల్పుచు జాతకశాస్త్రమును నమ్మవల్లయును యని నొక్కివక్కాణించును. వెల రు 0-4-0. ఇంగ్లీషులో అచ్చుపడినది.